సూర్యనారాయణ, అత్తిలి

హిందూదేశదారిద్ర్యము

రాజమహేంద్రవరము, 1907

Record no. 355

Sūryanārāyaṇa, Attili

Hindūdēśadāridyramu

Rājamahēndravaramu, 1907

Record no. 355

## Bibliographic Record Target

సూర్యనారాయణ, అత్తిలి.

హిందూదేశదారిద్య్రము / ఇది అత్తిలి సూర్యనారాయణచే బహుగ్రంథసాహాయ్యమున వ్రాయంబడినది; మనోరమ పత్రిక నుండి పునర్ముద్రితము.- రాజమహేంద్రవరము : చింతామణీముద్రాక్షరశాల, 1907.

(1), 33 p. ;20 cm.

Record no. 355

Sūryanārāyaṇa, Attili.

Hindūdēśadāridyramu / idi Attili Sūryanārāyaṇacē bahugranthasāhāyyamuna vrāyaṁbaḍinadi ; Manōrama patrika nuṇḍi punarmudritamu.- Rājamahēndravaramu : Cintāmaṇīmudrākṣaraśāla, 1907.

(1), 33 p. ;20 cm.

Record no. 355

# హిందూ దేశ దారిద్ర్యము.

ఇది

## అత్తిలి- సూర్యనారాయణచే

బహుగ్రంథసాహాయ్యమున వ్రాయఁబడినది.



('మనోరమ' పత్రికనుండి పునర్ముద్రితము.)

రాజమహేంద్రవరము :

యస్. గున్నేశ్వరరావుబ్రదర్సువారి
శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.
1907.

—

దీనివెల 2 అణాలు.

# ఉపోద్ఘాతము.

---

పూర్వము సమస్తసంపదలతోఁ దులదూగుచుండిన భరతఖండము కాలవశంబునంజేసి నేఁడు భాగ్యములకు వెలియయి కాటకములకు లోనై యిడుమలు గుడుచుచుంటఁ గన్నులారఁ గాంచి, ప్రసిద్ధపురుషులగు దాదాభాయి నౌరోజీ, విల్లియండిగ్బీ, రమేశచంద్రదత్తు, జి. సుబ్రహ్మణ్య అయ్యరు మున్నగువారు వ్రాసినగ్రంథములఁ జదివినప్పు డందలి ముఖ్యాంశముల సంగ్రహించి తెనుఁగునఁ దెలిపినపక్షమున నాయాంధ్రసోదరులకు స్వదేశప్రస్తుతస్థితి యించుక బోధపడి, రూపుమాసిన స్వదేశపరిశ్రమములఁ బునరుద్ధారణము చేయవలె నన్నయభిలాష పొడమి ప్రకృతము దొరతనమునందు సంక్షోభమునకును ప్రజలయందుఁ గలవరమునకును హేతుభూతమగుచున్న కఱవులబారి యడఁగకున్నె యన్న యాశయంబుతో నే నీచిన్నగ్రంథమును రచియించితిని. విషయము క్లిష్టమగుటచేఁ బ్రమాదవశంబుననేమి నాయజ్ఞతవలననేమి దోషంబులు పెక్కులిందుఁ జొచ్చియుండవచ్చును. అట్టివాని నెవ్వరేని దెలియఁ బఱచినచో వందనపూర్వకముగా నేను గ్రహించి సంస్కరించ గోరెదను.

అ. సూ. నా.



# హిందూదేశదారిద్ర్యము.

## మొదటి ప్రకరణము.

### పూర్వరాజుల పరిపాలనము.

మనదేశము నెవ్వరు పాలించుచున్నారు? ఆపరిపాలనమువలన మనకెట్టి లాభనష్టములు కలిగినవి? మనదేశముయొక్క ప్రస్తుతస్థితి యెట్లున్నది? అను విషయములను గూర్చి విచారించుట యీలోకములో పుట్టిన ప్రతిమనుష్యునకును అవశ్యకర్తవ్యమై యున్నది. తన జీవితకాలములో నొక్కసారియైనను తన దేశముయొక్క స్థితిగతు లెట్టులున్నవో, తనకును రాష్ట్రమునకును గల సంబంధ మెట్టిదో, తెలిసికొన బుద్ధిపుట్టని వాఁడు ఈలోకములో జన్మించిన ఫలమేమి? తాను మనుష్యుఁడై పుట్టినహేతువుచేత తనదేశపు పౌరతనమునుగూర్చి విచారించుటకు ప్రతిమానవునకును స్వాతంత్ర్యము కలదు. మనస్థితిగతు లెట్టులున్నవో మనము తెలిసికొనుటకంటె నెక్కువ విధియైనకార్యము మనకు మఱేదియుండును? ప్రస్తుతస్థితిని పరికించుటకు ముందు మనపూర్వస్థితి యెట్లుండెనో పరీక్షించినఁగాని భేదాభేదములు చక్కఁగా బోధపడి మనకు నిజమైన లాభమును సంతోషమును కలుగనేరవు. కాఁబట్టి ప్రస్తుత పరిపాలనమువలని లాభనష్టములను, మనస్థితిగతులనుఁ దెలిసికొనుటకుముందు, పూర్వము భరతఖండము ఎట్టి స్థితిలో నుండెనో, ఆ కాలమునందలి స్వదేశ పరదేశ రాజుల పరిపాలనమున మనదేశస్థులు నిఱుపేవలై కూటికి గుడ్డకు గతిలేక కష్టములు పడుచుండిరో లేక సంపన్నులై సౌఖ్యమున తులదూగుచుండిరో, పైరుపంటలకు కొదువలేక భూమి సారవంతమైయుండెనో లేక దేశము గొడ్డునేలలతో నిండియుండెనో, జనులు నాగరికులై జ్ఞానసంపన్నులై, పరోపకారపారీణులై యుండిరో, లేక లోకపరిజ్ఞానములేనివారై యేకాకులై యడవిమృగములవలె మోటుదనమున మునిఁగి యుండిరో, పూర్వకాలపురాజులు రాజ్యతంత్రజ్ఞులై దయాసమేతులై జనుల మన్ననకుఁ బాత్రులగుచుండిరో, లేక కేవల దుర్మార్గులై పిల్లలపిడుగులవలె భీతిఁగొలుపుచుండిరో, యిప్పుడు మనము కొంచెము విచారింపవలసి యున్నది.

పూర్వము భరతఖండము నాగరికతకు పుట్టినిల్లయి యుండెనని చరిత్రకారు లేకకంఠ్యముగా నంగీకరించుచున్నారు. కాని, మనదేశములో చరిత్రలు లేనిలోపము

చేతను, మనదేశస్థులు సాధారణముగా మనదేశమునుగూర్చి పాఠశాలలోఁ జదివెడి చరిత్రలు అన్యదేశస్థులచే వ్రాయఁబడిన వగుటచేతను, పూర్వరాజుల పరిపాలనముల గూర్చియు మఱి యితరముఖ్యవిషయములగూర్చియు నిజమైన సంగతులు సులభముగాఁ దెలియకున్నవి. ఈచరిత్రములలో ప్రాయికముగా మనదేశమును పూర్వము పాలించిన రాజులయొక్క దుర్గుణములే యెక్కువగా వర్ణింపఁబడి వారువారుచేసిన ఘనకార్యములును, ప్రజలకుఁ జేసిన మహోపకారములును, అంతగా నేర్కొనఁబడకుండుటచే, హిందూదేశము పూర్వము గాఢాంధకారములో మునిఁగియుండెననియు, ఇప్పటి బ్రిటిషుపరిపాలనమే దానిని మొట్టమొదట వెలుతురులోనికిఁ దీసికొనివచ్చి యదిపఱకీదేశములో జనులెన్నఁడు ననుభవించియుండని సౌఖ్యములఁ బ్రసాదించినదనియు నొక్కదురభిప్రాయము వ్యాపించియున్నది. మహమ్మదీయ చక్రవర్తులన్న దేశమును దుంపనాశము చేసిన కఠినులనియు, స్వదేశరాజులన్న మంచిచెడుగులు తెలియని నిరుపయోగులనియు మనవారిలో చాలమంది యభిప్రాయమైయున్నది. ఇట్టి దురభిప్రాయములను ముందు పోఁగొట్టుటకై నమ్మకమైన చరిత్రాంశముల నీక్రింద వివరించుచు, క్రమముగా హిందూదేశ మెట్టిస్థితినుండి మార్పులుచెందుచు వచ్చెనో సూక్ష్మముగాఁ దెలియఁజేయుచున్నాను.

గ్రీసుదేశములో అలెగ్జాండరు అను మిక్కిలి పరాక్రమవంతుఁడైన రాజొకఁ డుండెను. అతఁడు తన శౌర్యసంపదచే గ్రీసుదేశమునకును మన హిందూదేశమునకును మధ్యనున్న దేశములనెల్ల స్వాధీనముచేసికొని తుదకు హిందూదేశముపై దండెత్తివచ్చి కొందఱు హిందూరాజుల జయించి కొంతసైన్యము నీదేశమునందువిడిచి తనదేశమునకు మఱలిపోయెను. అప్పుడు మన దేశస్థులకును గ్రీసుదేశస్థులకును సంబంధము కలిగెను. భరతఖండమున వసించిపోయిన మెగాస్తానీసు మొదలగు గ్రీసుదేశస్థులాకాలములో హిందూదేశ మెట్టిస్థితిలో నుండెనో చరిత్రలలో వ్రాసియుండిరి. దానినిఁబట్టి సుమారు 2, 200 సంవత్సరముల పూర్వము మనదేశ మెట్టిస్థితిలోనుండెనో బోధపడఁగలదు. ఆకాలమునాఁటి హిందూదేశము నొకచరిత్రకారుఁ డిట్లు వర్ణించుచున్నాఁడు.

"గ్రీసుదేశస్థులు భరతఖండములో తాము చూచిన వివిధదేశములను వర్ణించిన వర్ణనమునుబట్టి యెల్లచోటులును జనసమృద్ధిఁ గలిగియుండెననియు, భరతఖండవాసు లెల్లరును మహోన్నత సౌఖ్యపదవి నందుచుండిరనియు నభిప్రాయము కలుగుచున్నది." ఆకాలమున పాటలీపుత్ర మనెడి నగరము 8 మైళ్ల పొడవును, $1\frac{1}{2}$ మైలు వెడలుపును గలదై, 570 బురుజులును 164 సింహద్వారములును గలిగిన యత్యున్నతమైన కోటచేఁ





జుట్టఁబడి వెలయుచుండెను. మఱియు విదేశములతో వర్తకవ్యాపారముల జరిపెడి పట్టణములును, యుద్ధసమయముల యందైనను మఱి యితరసమయములయందైనను జీతము లీయఁబడి దేశమును సంరక్షించెడి సైన్యమును, మిక్కిలి రాజభక్తితో నెల్లస్థలములయందును బనిచేసెడు రక్షకభటులును, (పోలీసు) దేశముయొక్క నాగరికతను వేనోళ్ల ఘోషించుచున్నవి. పొలములెల్లను కొలఁతవేయఁబడి, సేద్యమునకనువగునట్లు కాలువలమార్గమున నీరు సమముగాఁ బంచిపెట్టఁబడుచుండెను. పండినపంటలో నాలవ పాలు రాజునకు పన్నుక్రిందఁ జెల్లింపఁబడుచుండెను. రాజమార్గములును, మైలుమైలు నకును దూరమును బోధించు ఱాళ్లును, ఎందుఁజూచినను గానవచ్చుచుండెను. బంగారమును రత్నములును, పట్టువస్త్రములును వెలగల యాభరణములును లేని గృహమొక్క యాకాలములో లేదు. జనులు తమ శత్రువులయెడ నెంతయుఁ గనికరముకలవారై, ఏథెన్సు మొదలగు నాగరికత నందిన ప్రదేశములలోని జనులు ఏమియుఁ దెలియని యజ్ఞానదశయందున్న కాలమునందే, యీశ్వరతత్త్వమునుఁ జక్కగా నెఱింగినవారై, విద్యామహితులై పెంపొందియుండిరి.

తరువాత రాజ్యముచేసిన అశోకవర్ధనుఁడు, విక్రమాదిత్యుఁడు మొదలగు మహారాజుల పరిపాలనమునాఁటి యార్యావర్తదేశమును బరీక్షించితిమా, ఆకాలమునందు ధర్మము ప్రబలియుండెననియు, పెక్కుస్థలముల వైద్యశాలలు నిర్మింపఁబడి, ధర్మార్థముగా నూతులును జెర్వులును త్రవ్వఁబడి యుండెననియు, జనులు చల్లని పాలనమున సుఖమందుచుండిరనియుఁ దెలియుచున్నది.

పిమ్మట మహమ్మదీయుల దండయాత్రలనాఁడు సైతము సోమనాథపుర దేవాలయములోని యమూల్యధనమును, కనోజి మొదలగు దేశముల మహదైశ్వర్యమును జ్ఞప్తికి వచ్చుచున్నవి. విగ్రహనాశకుఁడనియు, జాలియెఱుఁగని పచ్చితురకయనియు, వర్ణింపఁబడిన గజనీమహమ్మదు పండితులనెల్లర రావించి సంభావించుచుండెననియు, భాషాభివృద్ధి చేయుటకై యెంతధనమైనను వెచ్చించెననియు, ధనసంపాదనమునకై యెంతబలాత్కారాపహరణమునకుఁ గడంగినను, ఆధనమును వ్యయముచేయుటయందలి సన్మార్గమతనికిఁ దెలిసినట్లు యితరుల కెవ్వరికిని దెలియదనియు నొకచరిత్రకారుఁడు వాకొనుచున్నాఁడు

అనంతరము కొంతకాలమునకు రాజ్యమునకువచ్చి ప్రసిద్ధిఁజెందిన కుతుబ్ మైనరును గట్టించిన కుతుబుద్దీను మిక్కిలి న్యాయపాలకుఁడైయుండెను. తరువాత సుల్తాను రిజియా యనుస్త్రీరత్నము సింహాసనమధిష్టించి న్యాయపథముఁదప్పక పరిపాలనముఁ

జేసెను. ఆమెయందుఁ దప్పన్న మాటయేలేదని ఫెరిష్టాయనెడి చరిత్రకారుఁడు వక్కాణించుచున్నాఁడు. ఆవెనుక రాజ్యాభిషిక్తుఁడైన జలాలుద్దీనుయొక్క దయయు, పరోపకారబుద్ధియు, భాషాభిమానమును, అనన్యసామాన్యములని చరిత్రలఁ బరిశోధించిన వారికెల్లరకును దెలిసియుండును. పదునాలవ శతాబ్దమధ్యమున నత్యున్నతపదవినందిన విజయనగరరాజ్యమును దలంచిన నప్పటిస్థితి నెఱుంగవచ్చును. ఈవిజయనగరమనునది తుంగభద్రానదిమీఁద నుండునది. ఆమహానగర శిథిలప్రదేశము లిప్పటికిని బళ్లారిసమీపమున నద్భుతముగఁ గానవచ్చును. ఆస్థలమున కిప్పుడు హంపియని పేరు. విజయనగర మహారాజులు యోధాగ్రగణ్యులు. వారిలోఁ గొందఱియౌదార్యమును మతసహనమును వర్ణనాతీతములని చెప్పుదురు. విజయనగరరాజొక్కఁడు తనరాజ్యములోనున్న మహమ్మదీయులకొఱకై యొకమసీదును గట్టించెను. ఇదియే అతని జనానురాగమును పరమత సహనబుద్ధిని చాటుచున్నది. 1351వ సంవత్సరమున రాజ్యముచేయుచుండిన టొగ్లోకు వంశస్థుఁడైన మహమ్మదుకాలమునాఁటికే రాష్ట్రమున నెల్లెడల సైన్యమును కాల్బలమును నిండియుండెనని తెలియుచున్నది. అటువెనుక రాజయిన ఫిరోజిషా యొక్క సత్కార్యములు పెక్కులుగలవు. అతఁడు దేశములో సేద్యమున కనుకూలముగా నీరు పాఱించుటకై నదులకడ్డముగా 50 ఆనకట్టలను, 30 కలాశాలలను, 100 బాటసారుల సత్రములను, 100 ధర్మవైద్యశాలలను, 100 గొప్పచెఱువులను, 150 వంతెనలను, గట్టించుటయేగాక పెద్దకాలువలను సైతము త్రవ్వించి లోకప్రఖ్యాతి వడసెను. ఆతనిపాలనములో బంగరునగలను ధరించని యిల్లాండ్రే యొక్కడను లేరనియు, హాయిగాఁ బరుండుటకై చక్కనిమంచమును, ఒకఫలవంతమైన తోఁటయును లేనివారైతే యెచ్చటను గానరాఁడనియు, చరిత్రకారులు కంఠోక్తిగాఁ దెలుపుచున్నారు. దీనికిఁ దోడుగా 1420వ వత్సరమున ఇటలీదేశమునుండి విదేశసంచారమునకై వెలువడి హిందూదేశమును జూడవచ్చిన యొకబాటసారియు, మఱియిద్దఱు బాటసారులును దామెక్కడఁ జూచినను వెండిబంగారములతోడను విలువగల రాలతోడను నిండియుండిన సుందర మందిరములును, మనోహరోద్యానములును, జనులచేఁ గిక్కటిల్లియుండిన నగరములును, కంటఁబడెననియు వ్రాయుచున్నారు.

యూరపియనులలోఁ జాలమంది యిప్పటికిని మనదేశస్థులన్నతోడనే యొకవిధమయిన యసహ్యభావమును బూనునట్లుగా, హిందువులన్న నేవఁజెందెడు బేబరు సైతము హిందూదేశము మిక్కిలిభాగ్యవంతమయి ఘనతఁజెందిన దని చెప్పుచున్నాఁడు. ఈబేబరు మొగలాయిచక్రవర్తులలో మొదటివాఁడు. జనులచే గిక్కటిల్లియుండిన పట్టణములను,





శిల్పాదివిద్యలయం దన్నిటియందును ఆరితేఱిన పనివాండ్రను జూచి యతఁ డత్యాశ్చర్యపరవశుఁ డయ్యెను.

తరువాతఁ గొంతకాలమునకు షర్షా యనునతఁడు రాజ్యాధిపతియయ్యెను. అతని చల్లని పరిపాలనమున అల్లరులు గాని యసంతుష్టిగాని లేవయ్యెను. రాజమార్గములు వేయుట, కాలువలు త్రవ్వించుట, సత్రములు కట్టించుట, బీదలను పోషించుట. మొదలగు సత్కార్యముల నతఁ డనేకములు చేసెను.

అనంతరము లోకైకప్రఖ్యాతి వడసిన యక్బరు చక్రవర్తి యయ్యెను. అతఁడు పాలనము చేయునప్పుడు తెల్లవారు కొందఱీదేశము వచ్చి యాతని దర్శనము చేసియుండిరి. వారతని నీక్రిందివిధమున వర్ణించియుండిరి. "అక్బరు పరులతో మర్యాదతోడను ధారాళముగను సంభాషించును. ఆతని యాకృతి గంభీరమైనను, హృదయము నవనీత సమానమయినది. ఆహారమునందును, నిద్దురయందును ఆతఁడు మితము ననుసరించును. ఫిరంగులను జేయుటయం దతనికి మిక్కిలి చతురత గలదు. శిల్పాది విద్యలయందు సైత మతనికి మంచిప్రావీణ్యము కలదు. చూపరులకు వింతగొలుపునట్లు అతఁ డెప్పుడును ఏదియో యొక పనిని జేయుచునే యుండును గాని సోమరిగా నొక్క నిముసము నైనను పోనీయఁడు. అతఁడు నీచులయెడ దయాసహితుఁడై శత్రువులకు భీకరుఁడై, యుండును. స్వజనము ఆతని నెంతయు భయభక్తులతో గౌరవించుచుండును." ఇట్టి సుగుణసంపదగల యక్బరు చక్రవర్తి హిందువులయెడను, హిందూమతమునెడను ఎంతో గౌరవముకలవాఁడై యుండెను. తనరాజ్యములో హిందువులకు గొప్పయుద్యోగము లిచ్చుటయేగాక హిందువును తనమంత్రినిగా సైత మంగీకరించి మన్నించెను. అతఁడు కావించిన మహోపకారములు పెక్కులు కలవు. భూములను కొలిపించి శాశ్వతమయిన పన్ను విధించెను. సహగమనమును మాన్పెను. వితంతువులను పునర్వివాహములఁ జేసికొననిచ్చెను. జీవహింసకు శిక్ష విధించెను. తనసేనకు తన శాశ్వత మూలధనమునుండి జీతముల నిచ్చుచుండెనే కాని, జనులమీఁద కట్టిన పన్నులనుండి కాదు.

ఇట్లతఁడు చేసిన సత్కార్యముల నెల్ల సెన్నఁ దరము కాదు. అటుపిమ్మట రాజ్యమునకువచ్చిన యతని కుమారుఁ డగుజహాంగీరు న్యాయపరిపాలనాదక్షుఁ డనియు, అమేయదయాసహితుఁ డనియు, ఆకాలములో హిందూదేశమును జూడవచ్చిన యొక యిటలీదేశపు బాటసారి వ్రాయుచున్నాఁడు. అక్బరు చక్రవర్తి మనుమఁడైన షాజహాను సింహాసన మెక్కినప్పుడు దేశము మిక్కిలి నెమ్మదిగా నుండెననియు, జనులు

హాయుగా సంతుష్టిఁ జెందుచుండి రనియు, రాష్ట్రములో నంద అను కన్నతల్లివలె నతఁడు కాపాడుచుండె ననియు, చరిత్రకారులు స్పష్టముగా వ్రాసియున్నారు.

వీరివెనుక రాజ్యమునకువచ్చిన మొగలాయిచక్రవర్తులు బలహీనులై, కలహప్రియులై, హిందువులయెడ సమానబుద్ధిలేనివారై, చిత్తమువచ్చిన తెఱఁగున రాజ్యము చేసినను, 1739వ సంవత్సరమున నాదర్షా యనెడి చండశాసనుఁ డొకఁడు దాడి వెడలి వచ్చి ఢిల్లీపురమును విధ్వంసము చేసి కొల్లఁగొని పోయినధనమును జూచినను, దక్షిణదేశమున మాలికాంబరు మొదలగు తురకలు ఆకాలమున రాజ్యము జేయుచుండ జనులు మహదైశ్వర్యమున ననుభవించెడి సౌఖ్యమును విచారించినను, హిందూదేశ మప్పటికిని మంచిస్థితియందే యుండెనని నిశ్చయింపఁబడఁ దగియున్నది.

పదునేడవ శతాబ్దాంతమున నొక్కదేశాభిమాని బయలుదేఱి మొగలాయి పరిపాలనమునకు చిచ్చువెట్టి ప్రఖ్యాతివడసెను. 'కొండయెలుక' యని యెన్నఁబడిన యావీరుని పేరు శివాజి. అతని సాహసమును, అతని ధైర్యమును, శత్రువులయెడ నతనికిఁగల కనికరమును, వర్ణనాతీతములు. సాధారణముగా విద్యార్థులు చదివెడి దేశచరిత్రలలో నతఁడు దుండగీఁడుగా వర్ణింపఁబడెను గాని, యతని సద్గుణములును, అతని పరిపాలనాసామర్థ్యమును, అతని పరాక్రమమును, తెలుపునంశములు వ్రాయఁబడలేదు. ఆకాలములో మహారాష్ట్రదేశమునందు ప్రయాణముచేసిన యొకవిదేశపు బాటసారి వ్రాసిన యీక్రింది వ్రాఁతనుబట్టి యతఁ డెట్టివాఁడో స్పష్టపడఁగలదు.

“మార్చి 27 వ తేదిని సూరతుపట్టణమువద్ద పడమటికనుమలను దాఁటి మహారాష్ట్రములో ప్రవేశించునరికి ఉదయము 10 గంట లయ్యెను. నే నామహారాష్ట్రదేశములో నడుగు వెట్టినతోడనే, దైన్యవ్యసనములన్న నేమో యెఱుంగక, యుద్ధములు కయ్యములన్న నేమో తెలియక నిష్కాపట్యమునందును నిరంతరసౌఖ్యమునందును మునిఁగియున్న సత్యకాలపుజనులు నివసించు వింతదేశమునకు వచ్చినట్లు నే ననుకొంటిని. జను లెచ్చోటఁ జూచినను దృఢకాయులుగాను, ఉత్సాహపూరితులుగాను, ఆరోగ్యసంపన్నులుగాను గనఁబడుటయే గాక మితములేని అతిథిసత్కారము వారిలో నెల్లరకును పుట్టుకతోడనే నేర్చిన సుగుణముగాఁ గానవచ్చెను. ప్రతిగృహమునకును బంధుమిత్రులును, ఇరుగుపొరుగువారును, పరిజనులును, వచ్చి యందున్న సమస్తపదార్థములను దమ యిచ్చవచ్చిన రీతిని గొనిపోవుట కడ్డంకి లేకయుండెను. ఔరంగబాదున కేడుమైళ్ళ సమీపమునకు వచ్చినతోడనే యెల్లోరాపురమునందలి సుప్రసిద్ధిఁ జెందిన గోపురమును జూడఁబోయితిని.”





శివాజీ వెనుక పీష్వాల పరిపాలనముఁ జూచిన మిగుల శ్లాఘాపాత్రముగా నుండును. కౌశల్యమునకును బుద్ధికుశలతకును పేరందిన బాలాజీవిశ్వనాథుని దలంచినను, రాజ్యతంత్రజ్ఞతకును వక్తృత్వమునకును సుగుణములకును ప్రఖ్యాతిఁ జెందిన బాజీరావుని దలంచినను, పరోపకారపారీణతకును ఔదార్యమునకును ప్రసిద్ధిగన్న బాలాజీబాజీరావుని దలంచినను, నీతివిశారదుఁడును నీతిమంతుఁడు నైన రామశాస్త్రి యనెడిమంత్రిశేఖరుని సాహాయ్యమున ననేకమహాత్కార్యములఁ జేసి తీర్పులఁ జెప్పుటయందు పంచాయతీపద్ధతి నేర్పఱిచి యున్నతినందిన మాధవరావును దలంచినను, అక్షరశూన్యులైన నేమి కున్నను ఎంత స్వల్పవిషయమునైనను జ్ఞప్తియం దుంచుకొని తనరాష్ట్రములో నేమూల నేకార్యము జరుగుచున్నదియు బాగుగా నెఱింగి యమితశక్తితో పాలనము చేసిన మైసూరు ప్రభు వగుహైదరాలిని దలంచినను, లేక, కుశాగ్రబుద్ధియై మహావీరుఁడై రాజ్యాంగవివేకదక్షుఁడై, యెన్నికగన్న టిప్పుసుల్తానును గాని, మంత్రితిలకుఁ డగు పూర్ణయ్యను గాని తలంచినను, హిందూదేశమును పాలించిన పూర్వరాజులు కాలమందు ఈకాలములో నాగరికతఁ జెందిన దేశముల నేలెడు రాజులకన్న దీసిపోవువారు కారనియు, వారికొరతనములలో ప్రజలు హాయిగా సుఖించుచుండిరనియు, ఆకాలములో క్షామములే యరిదియై యుండెననియు, భూములు సారవంతములయి జనులు బలవంతులయి యుండి రనియు స్పష్టపడక మానదు.

ఇంగ్లీషువారు మొట్టమొదట ఈదేశమున వర్తకము చేయువలె ననుతలంపుతో నొకకంపెనీగా నేర్పడి ఆతలంపును క్రమముగా మార్చుకొని యూరూరు తమ స్వాధీనము చేసికొని, యన్యాయమున కొడిగట్టి స్వదేశరాజులలో కలతలను బెంచి యందొకపక్షముఁ జేరి యుద్ధములు పెక్కులు సల్పి దేశములోని సొమ్మదిని చెడఁగొట్టియు కైట్లో కొన్నిదేశభాగములను దమయధీనము గావించుకొనిరి. దేశములో నీకంపెనీవారివలన వచ్చిన పోరులచేత జనులసౌఖ్యము నానాఁట సన్నగిలనారంభించెను. ఇట్టికల్లోలములలో మునిఁగియున్నపుడు సైతము కొన్ని స్వదేశరాజ్యములు మిక్కిలి సౌఖ్యదశలో నుండెను. సురాజుద్దౌలాకు పూర్వము రాజ్యమునకువచ్చిన అలివర్దీఖాను కాలములో వంగదేశము మంచిస్థితిలో నుండెను. ఆతని పరిపాలనమున దుర్మార్గులును దుష్ప్రవర్తకులును ఉద్యోగములనుండి పూర్ణముగా తొలఁగింపఁబడిరి. అతఁడు ఈశ్వరవిశ్వాసము కలవాఁడై యెల్లరను తనసోదరులనుగా భావించుచుండెను. హిందువులను తన తురకసోదరులతో సమముగాఁ జూచి హిందువులనే తన మంత్రులనుగా నెన్నుకొనుచుండెను.

స్టూవార్టను వంగదేశచరిత్రకారుఁ డతని పాలనములో నున్నంత సెమ్మదిని, సౌఖ్యమును, న్యాయమును, జను లెన్నఁడునను భవించియుండలేదని వ్రాయుచున్నాఁడు. ఇట్టి మంచిస్థితియెల్లను ఇంగ్లీషువారి పాలనమునకు వచ్చినతోడనే పదిసంవత్సరములలో సంపూర్ణముగా మాఱిపోయె నని మెకాలేదొరగారు వ్రాసినదానినిబట్టి స్పష్టముగాఁ దెలియుచున్నది. ఒకనివెనుక నొకనిని ఈకంపెనీవారు తమ యిచ్ఛవచ్చిన చొప్పన అయోధ్య సింహాసనముపై నిలుపఁజొచ్చిరి. కంపెనీవారికి ధనదాహ మెచ్చినకొలఁదిని మనదేశస్థులు తమవద్ద సరకులు కొనునప్పు డెక్కువధరలకుఁ గొనుటకును, తాము వారి వద్దఁ గొనునప్పుడు తక్కువధరల కమ్మునట్లు నిర్బంధించియు, మఱి యితరములైన యన్యాయమార్గము లవలంబించియు మితములేని ధనమును గూర్చుకొనిరనియు, అందుచే మూఁడుకోట్ల హిందూజనులు నిఱుపేదలై దిక్కుమాలినవారు కావలసివచ్చె ననియు సుప్రసిద్ధులైన మెకాలేదొరగారు సెలవిచ్చుచున్నారు. కొంకుజంకులేక యిట్లు కంపెనీవారు మాటిమాటికి యుద్ధములు సలిపి మనదేశస్థులను కోట్లకొలఁది జనులను తమపొట్టను బెట్టుకొని, తాము పాలించెడిదేశములలోని ధనికుల ధనాగారముల గుల్లచేసిన హేతువుచే హిందూదేశము క్రమక్రమముగా క్షీణింపఁజొచ్చినను, ఆకాలములో రాజపుత్రస్థానము మొదలగు స్వదేశరాష్ట్రములలో పండెడు పంటలను, జను లనుభవించు సౌఖ్యమును, జూచియు, కంపెనీవారి యధీనములోనున్న దేశములోని హీనస్థితిని జూచియు, 1822వ సంవత్సరములో బ్రిటీషువారి హిందూదేశస్థితినిగూర్చి చరిత్రము వ్రాసిన వైటుదొరగారు మిక్కిలి యక్కజపడి, స్వదేశరాజులే కంపెనీవారికంటె నెక్కువచక్కఁగా నేలుచున్నారని వ్రాసియుండిరి. స్వదేశరాజులు పరిపాలనాసామర్థ్యములేనివారు కారని యీపైయంశములనుండియే గాక, అహల్యాబాయి మొదలగువారి దొరతనమునకంటె శ్రేష్ఠముగా నుండునది లేదని గ్రంథవిస్తరభీతిలేని పక్షమున స్పష్టముగా నిర్ధారణ చేయవచ్చును. ఒక గవర్నరుజనరలు తరువాత వేరొక గవర్నరు జనరలువచ్చి యొకనిమించి మఱియొకఁడు దుండగములఁ జేసి దుష్పరిపాలనముచేసి దేశములో సంక్షోభమును వృద్ధిఁ బొందించుచుండుటఁ జూచి సహింపలేక, 1856వ సంవత్సరమున హిందూదేశమున సైన్యమును తక్కిన జనులును దొరలపై తిరుగుబాటుచేసి చేసినపెద్దయల్లరులనుగని, యీకంపెనీవారు ఇంతటిదేశమును ఏలుట కెంతమాత్రమును సమర్థులు కారని నిశ్చయించి ఘనత వహించిన విక్టోరియామహారాజ్ఞిగారు మనదేశపాలనమును కంపెనీవారి చేతిలోనుండి తొలఁగించిమార్చి క్రొత్తయేర్పాటులపై ఇంగ్లీషుపార్లమెంటువారి స్వాధీనములో నిలిపిరి. తరువాతఁ గొంతవఱకుపూర్వమునఁ బ్రబలియున్న యల్లరులుమాని క్రమముగా దేశము సెమ్మదిని బొంది జనులు సుఖింప నారంభించిరి.





ఈనూతనపరిపాలనమున పూర్వము మనదేశస్థు లనుభవించి యుండని కొన్ని సౌఖ్యములు కలిగినవి. ఇంచుక విద్య వృద్ధియయి మనస్థితిగతు లెట్లున్నవో కదా యని తెలిసికొనుటకు అవకాశము చిక్కెను. రాకపోకలు సులభము లగునట్లుగాను వాణిజ్యము ప్రబలునట్లుగాను రైలుమార్గములు వేయఁబడెను. ఇవిగాక తంత్రీసమాచారములు క్షణకాలములో వినుటయు, ఎల్లదిక్కుల తపాలాఫీసులు వ్యాపించుటయు సంభవించెను. నీటివసతి కలిగి సస్యాభివృద్ధియై యున్న చవిటిపఱ్ఱలుగా నున్న నేలలు చాలవఱకు సారవంతము లయ్యెను. పోలీసు మొదలగుపద్ధతులచే దేశము పూర్వ మున్నంత సంక్షోభముగా లేకుండునట్లు చేయఁబడెను. దేశము పరరాజులబారినుండి కాపాడుటకయి స్వదేశసైన్యమే కాక తెల్లవారిసైన్యముకూడ మనదేశమునందు నిలుపఁబడెను. దేశము రాజధానులక్రిందను పరగణాలక్రిందను విభాగింపఁబడి వేర్వేఱు అధికారుల కొప్పగింపఁబడి రాజప్రతినిధి హస్తములలో దేశమంతయు నుంచఁబడి యింగ్లాండులోనున్న సెక్రటరీయొక్క పైవిచారణకు స్వాధీనము చేయఁబడెను. అతఁ డీదేశమునుగూర్చిన సంగతుల నెల్ల పార్లమెంటువారికి నివేదించుచుండును. ఈపైని జెప్పినలాభములు కొన్ని మనకుఁ గలిగినమాట వాస్తవమే యయినను, ఈపైకట్టుబాటులతో నేర్పఱిచినదొరతనము స్వతస్సిద్ధముగా మేళ్లకంటె కీడులనే యెక్కువ కలిగించునదిగా నున్నదని బుద్ధిమంతులు పలువు రభిప్రాయపడియున్నారు. విదేశస్థులపరిపాలనమువలనఁ గలిగెడు లాభములకంటె నష్టములే యెక్కువ యుండక తప్పదని చాలసంవత్సరములక్రిందట మన దేశమును గవర్నరుజనరలుగాఁ బాలింపవచ్చిన సర్ జానుషోరుదొరగారు సెలవిచ్చియుండిరి. సర్ జార్జి హామిల్టన్ దొరగారు "నుశయింగ్లీషు దొరతనము హిందూదేశములో నెన్నఁటికిని జనసమ్మతముగా నుండదు." అని 1839వ సంవత్సరములో వ్రాసియున్నారు. "సంకెళ్లలో నెల్ల మిక్కిలిబరువైనసంకిలి యేది యనఁగా విదేశపుసంకిలి" యని లార్డు మెకాలేదొరగారు నుడివిరి. ఈయభిప్రాయములయందలి సత్యాసత్యములు ముందుప్రకరణములఁ జదివిన బోధపడఁగలదు గనుక, ఆవిమర్శనాభారమును చదువరులమీఁదనే విడిచిపెట్టుచున్నాను.



## రెండవ ప్రకరణము.

### కాటకములు.

మనదేశములో కాటకములు వచ్చుటకు కారణము సాధారణముగా తగువేళ వర్షము కురియకుండుటగాని యనావృష్టిగాని యయియున్నది. ఇట్లితరదేశములయందు సైతము అనావృష్టి మొదలగునవి తాత్కాలికముగా దైవవశమున సంభవించుచున్నను, ఆదేశములలో నట్టిస్వల్పనష్టము లొకలెక్కలేక జనులు సుఖస్థితినే నిలిచియుండుటకును, మనదేశములో భీకరమయినసంక్షోభము పుట్టి జనులు తిండిలేక, యొకదొరగారు వ్రాసినట్లు ఈఁగలవలె కోట్లకొలఁది యొక్కమాఱుగా నశించుటకును, మనదేశస్థులితరదేశస్థులవలెఁగాక మిక్కిలిబీదదశలో నుండుటయే కారణము. ఈబీదదశ మన బ్రిటిషువారిపరిపాలనము వచ్చినతరువాతనే వచ్చియున్నదా లేక అంతకుముందే మనము గర్భదారిద్ర్యములో మునిఁగియుంటిమా యన్నవిషయమును నిర్ధారణచేయుటకయి నేను మొదటిప్రకరణములో వ్రాసినచరిత్రాంశములే చాలియుండినను, మనదేశములో కాటకములచరిత్రనుగూడ నించుక సంగ్రహించి యిందుఁ బొందుపఱిచినపక్షమున దాని కుపబలముగా నుండవచ్చు నని నమ్మి యిప్పు డాకఱవులచరిత్రను కొంచెము వ్రాయుచున్నాను.

పదునొకండవ శతాబ్దమునకు పూర్వము మనదేశములో కఱవులు సంభవించె ననుటకు నిదర్శనములు కానరావు. పదునొకండవశతాబ్దములో, అనఁగా నొక్కనూఱు సంవత్సరములకాలమునందు, రెండుక్షామములుమాత్రమే కలిగెనఁట. ఆవియైనను దేశమున వ్యాపించినవిగాక యొక్కడనో యొక్కగ్రామములోఁ గలిగినవేయై యున్నవి. అందుచే మృతిఁ జెందిన జనులసంఖ్య గణించుటకు సైతము మిక్కిలి స్వల్పముగా నుండెను.

అటుపిమ్మట పదుమూడవశతాబ్దమునందు ఒక్కకాటకముమాత్రమే పొడసూపెను. అదియైనను ఒకఢిల్లీపురము చుట్టుప్రక్కలఁదప్ప నితరస్థలములకు వ్యాపించియుండలేదు.

ఈవిధముగానే పదునాలుగవ శతాబ్దమునందు మూడును, పదునేనవశతాబ్దమునందు రెండును, పదునాఱవశతాబ్దమునందు మూడును, పదునేడవ శతాబ్దమునందు మూడును, 1700వ సంవత్సరము మొదలు 1745వ సంవత్సరము వఱకును నాలుగును కనుపట్టెను. ఇవి యన్నియు నేమూలనో యొక్కప్రాంతములో తటస్థించెనుగాని, దేశమంతయు నెన్నఁడును క్షామముచే పీడింపఁబడలేదు. ఈక్షామములలో మృతినొందినవారిసంఖ్య





సైతము అత్యల్పముగా నుండెను. ఇట్టిసుఖస్థితియెల్లను ఇంగ్లీషువారిదొరతనము వచ్చినతోడనే యెంతవింతగామాఱిపోయెనో యీక్రిందియంశములనుబట్టి విచారింపుఁడు. 1750వ సంవత్సరము మొదలుకొని 1850వ సంవత్సరమువఱకును మనదేశములో 12 క్షామములు వ్యాపించి 18 లక్షలజనులు కూడులేక మలమలమాడి మృతిఁ జెందిరి. 1850వ సంవత్సరము మొదలుకొని 1875వ సంవత్సరమువఱకును, అనఁగా నొక్క 25 సంవత్సరముల కాలములో 12 కాటకములు చెలరేఁగి సుమారు 50 లక్షలజనుల నంతమొందించెను. తరువాత 1875వ సంవత్సరమునకును 1900ల సంవత్సరమునకును గలకాలములో 18 కఱవులు బయలుదేఱి దేశ మెల్లయెడల వ్యాపించి 2 కోట్ల 60 లక్షల జనులను దిక్కుమాలినబలవన్మరణముపాలుచేసెను! రత్నగర్భ యనియు, బంగరుకొండ యనియు, వరాలచెట్టనియు, పేరందిన మనదేశమున కిట్టినిర్భాగ్యదశ వచ్చినదన్నతోడనే యెవనిమన మెఱియకుండును? భోగభాగ్యములందుఁ దులదూఁగుచున్న మనయార్యావర్తదేశమునకే యిట్టివిపత్తు ఘటిల్లె నన్నప్పుడు ఈలోకములో జరగఁబోని దేముండును? అగ్గికిఁ జెదపట్టునే యన్నలోకోక్తి నేఁడు అసత్యముగాఁ గనుపట్టుచున్నదికదా!

కాటకములు సంభవించినప్పుడు సాధారణముగా నిఱుపేదకుటుంబముల వారే మృతిఁజెందుదు రనియు, భాగ్యవంతులచెక్కు చెదర నేర దనియుఁ గొందఱు భావింపవచ్చును. ఆమాటయబద్ధము. మనదేశములో భాగ్యవంతులసంఖ్య క్రమముగా సన్నగిలుచున్నది. భాగ్యవంతులే కాటకములధాటి కాగలేక యుండిరన్నప్పుడు, సాధారణజనులమాట చెప్పనేల? లక్షలకొలఁది గొప్పకుటుంబములవారే కాటకముల వలనఁ జిక్కులు పెక్కు లనుభవించి కీటకములవలె మృతిఁ జెందిరని లార్డు జార్జి హామిల్టనుగారే యొప్పుకొన్నరీతిగా గవర్నమెంటువారిలెక్కలవలననే స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది.

ఈకఱవులవలన కొన్నిపట్టణములే పూర్ణముగా నశించెను. గ్రామములు పాడువడెను. వీథులవెంబడిని, రాజమార్గములయందును, నదులయందును లెక్కలేనిశవములు దృగ్గోచరము లగుచుండి గుండియ లవియుచుండెను. ఇఁక దుంపనాశ మైనపైరుపంటలకును, తోఁటలకును, లెక్కలేదు. మనదేశములోఁ గలిగినట్లు మఱియేదేశమునందును ఏకాలమునందును క్షామములు కలిగియుండలేదనియు, మఱియేదొరతనముక్రిందను ఇంత స్వల్పకాలములో నంతమందిమానవులు మృతిఁ జెందియుండలే దనియు నెందఱో ఘనులు ఘంటాపథముగా వక్కాణించుచున్నారు. ఈకాటకములమూలమునఁ బంటలు నశించుటచేత నీమధ్య నొక్కపదిసంవత్సరములలో సుమారు 3000000000 రూపాయలు

మనదేశమునకు నష్టము సంభవించెనని ప్రసిద్ధివహించిన జీ. సుబ్రహ్మణ్య అయ్యరుగారు దొరతనమువారి లెక్కలనుబట్టియే స్పష్టముగా సిద్ధాంతము చేసియుండిరి.

మనదేశములోఁ గలిగినక్షామము లెంత ఘోరమయినవో యీక్రిందియంశమువలనఁ జక్కఁగాఁ దెలియఁబడఁగలదు. ఈభూలోకములో నైదుఖండములు కలవు. అందు ఎన్నిదేశములోఁ గలవు. ఈయైదుఖండములలోను, ఈ అన్నిదేశములలోను, 1793వ సంవత్సరము మొదలుకొని 1900వ సంవత్సరమువఱకును లెక్కలేనియుద్ధములు అప్పుడప్పుడు జరగి యాయుద్ధములయం దెందఱో జనులు మడిసియుండిరికదా. అట్లు 1793వ సంవత్సరము మొదలు 1900ల సంవత్సరమువఱకును గల 107 సంవత్సరముల కాలములో యుద్ధములలోఁ జచ్చినవారిసంఖ్య 50 లక్షలని లెక్కలవలనఁ దెలియుచున్నది. ఒక్కమనహిందూదేశములో 1890వ సంవత్సరము మొదలు 1900ల సంవత్సరమువఱకుఁగల పదిసంవత్సరములకాలములోఁ దిన తిండిలేక దిక్కుమాలినపక్షులవలె నశించినవారిసంఖ్య 190 లక్షలని గవర్నమెంటువారిలెక్కలవలననే తేలుచున్నది! ఆహా! ఏమి యీయాశ్చర్యము? యుద్ధములలో గుండుదెబ్బలచేతను, కత్తియేటులచేతను మానవులను బలవంతముగాఁ జంపుదానికంటె ఈకాటకములమూలమునఁ జచ్చెడి చావు మిక్కిలి ఘోరముగా నున్నదికదా! ఇంతకంటె నిర్భాగ్యదశ యెక్కడ నుండును?

ఈకాటకములమూలమున మనదేశములో జనసంఖ్య వృద్ధియగుటకూడ తగ్గిపోయినది. 1891వ సంవత్సరములో మనదేశములోని జనసంఖ్య 287,223,431 అయి యుండెను. అదివఱకు లెక్కలనుబట్టి సంవత్సరమునకు మనదేశములో మొత్తముమీఁద నెంత వృద్ధి యగుచున్నదో దొరతనమువారు గణించియుండిరి. వారిగణననుబట్టి 1900ల సం. లో మనదేశములోని జనసంఖ్య 330,306,945, అయియుండవలసినది. దానికి మాఱుగా 294,000,000 మాత్రమే లెక్కకు వచ్చినది. అనఁగా శేషించినసంఖ్య 36,306,945!

దీనికిఁ గారణమేమి? నిరాహారులయినహిందువులు లెక్కలేక గతించుచుండుటయే. ఈనిర్భాగ్యదశ మనకు హూణపరిపాలనము వచ్చినతరువాతనే యని మొట్టమొదటి గవర్నరుజనరలగు వారను హేస్టింగ్సుదొరగారి యీక్రిందివ్రాఁతవలననే స్పష్టపడుచున్నది.

“బాక్సారుపాలిమేర మొదలుకొని కాశీనగరమువఱకును నేను పోవుచుండఁగా సంతుష్టిలేక దీనదశయందుండిన గ్రామస్థులు నన్ను వెంబడించుచు బిగ్గఱగా నఱచుచుఁ జేసెడిమొఱ్ఱలు వినలేక నేను అలసిపోతిని. పెక్కునాళ్ళుండిన యనావృష్టిచేఁ గలిగిన





దుఃఖము జనుల యసంతుష్టిని మఱింత వృద్ధిఁజేసిన దయ్యెను. అయినను ఈనిర్భాగ్య దశకు హేతువు అన్యాయమయి, క్రూరమయి, లోపపూరితమయినదుష్టపరిపాలనమే యయియుండునని నాకు నమ్మకము చిక్కినది. నేను తిరిగిన యీప్రాంతములలో నెక్కడఁ జూచినను ప్రతిగ్రామమును దుంపనాశము చేయఁబడినట్టు జాడలుమాత్రమే నాకుఁ గనుపట్టెను. ఇట్టిస్థితిఁ జూచినతోడనే నాకు మిక్కిలి విచారము కలిగెను. నేను చూచినదానినిబట్టి యొక్కకాశీపురమునందుఁ దక్క యితరప్రదేశము లన్నియు అరాజకముగానే యుండెనని చెప్పక తప్పదు. ఈరాష్ట్రములో పరిపాలనము యక్రమముగా నడుపఁబడుచున్నది. ప్రజలు హింసింపఁబడుచున్నారు. వాణిజ్యమన్ననో యడ్డుపెట్టఁబడి నిరుత్సాహపఱుపఁబడుచున్నది. పన్నులు వచ్చెడియాధారము లన్నియు ప్రత్యక్షముగా దోచుకొనఁబడుటచే గవర్నమెంటురివిన్యూకూడ మిక్కిలి యెక్కువగా వెంటనే పడిపోయెడుస్థితి కనుపట్టుచున్నది.”

చూచితిరా? యీదుస్థితి యంతయును అయోధ్యకంపెనీవారి స్వాధీనమయిన తొమ్మిదిసంవత్సరములకాలములో వచ్చినదే. ఈయొక్కరాష్ట్రముయొక్క దీనచరిత్రమునుబట్టియే తక్కినరాష్ట్రములు కంపెనీవారిపాలయినతరువాతఁ గ్రమముగా నెట్టిహీనదశకు వచ్చి కాటకములు పెచ్చుపెరిగి యెన్నికొంపలు గూల మొదలుపెట్టెనో స్పష్టముగా నూహింపవచ్చును.

గతించిన 25 సంవత్సరములలో మనదేశమున క్షామమువలన నన్నములేక గతించినవారిసంఖ్యనుబట్టి యొక్కొకనిమిషములో మనహిందూదేశమునందు ఇద్దఱును ఒక్కగంటలో 120 మందియు, ఒక్కదినములోపల 2880 మందియుఁ జచ్చిపోవుచున్నారని డిగ్బిదొరగారి లెక్కలవలనఁ దేలుచున్నది. నానాఁటికి ఇట్టిచావులు మనదేశములో తామరతంపరగాఁ బెరుగుచున్నవి. గతించిన పదిసంవత్సరములలో ఈకాటకములవలన మృతిఁజెందినవారిసంఖ్యనుబట్టి చూచినపక్షమున మనదేశములో ప్రతినిమిషమునను నలుగురు, అనఁగా ఒక్కగంటకాలములో 240 మందియు, ఒక్కదినములో 5760 మందియు తిండిలేక చచ్చిపోవుచున్నారని తేలుచున్నది! రవ్వంతదేశాభిమానమే యేగుండెమూలనైనను నిలిచియున్నపక్షమున ప్రతిమానవుఁడును, అయ్యో! నామాతృదేశమునందు ఒక్కనిమిషకాలములో నలుగురుజనులు కూటికిసైతము గతిలేక పరలోకమునకుఁ దరలిపోవుచున్నారే యని చింతించి బొటబొట కన్నీరు మున్నీరుగా విడువకుండునా? ఎక్కడఁ జూచినను బంగారుగను లేమి? చక్కనిపైరుపంట లేమి? నా దేశమునందు జనించిన బిడ్డలు, ఆర్యావర్తదేశములోఁ బుట్టిన యీమానవులు, నీచాతినీచ

ముగా కుక్కలవలె వీధులలోఁ దిని పాఱవైచిన యెంగిలివిస్తరాకులను గొలఁకి మెతుకుల నేంచుకొని తినుట యేమి? యని విచారించి యెందుచేత నాదేశమున కీదుర్గతి సంభవించినదని కారణముఁ జక్కఁగాఁ బరిశోధించి దానికిఁ దగినఁ బరిహారమార్గ మాలోచింపకుందునా?

ఒక్కపదిసంవత్సరములలో మనదేశమున 19,000,000, జనులు తినఁ దిండిలేక మృతిఁ జెందిరని చెప్పియుంటినిగదా! సీమలోని జనసంఖ్య 40,000,000 అయియున్నది. తనదేశములోని జనులలో సగముమంది కాటకములచేఁ బీడింపఁబడి నశించినచో ఏతెల్లవాఁడైన నూఱకుండునా? వారికి స్వదేశభక్తి యున్నది. మనకు లేదు. మనకుఁ గావలసినదే స్వదేశభక్తి.

మనదేశములో క్షామము వచ్చునప్పుడు దొరతనమువారు చాలసొమ్ము వ్యయపఱచి తినఁ దిండిలేనివారికిని కట్ట బట్టలేనివారికిని సాధనములఁ గల్పించుచున్నారు. సంతోషమే. కాని పుండొకచోట నున్న మందొకచోట వేసిన నేమి ప్రయోజనము? వ్యాధి రాకుండునట్లుగా ముందే జాగరూకత కలిగియుంట మేలుగాని, వ్యాధివచ్చిన వెనుక మందు సేవించుట క్షేమకరమా? ఈదొరతనమువారు క్షామకాలమున వెచ్చించెడుధనము మనవద్దనుండి గైకొనినపన్నులలోనిదే. క్షామములవలనఁ గలిగెడి జననష్టము, పంటలనష్టము, మొదలగువాని కిదిగూడఁ దోడగుచున్నది!

ఈకాటకములకు హేతువు వెదకుటకయి లార్డు కర్జనుదొరగారు పాపము చాల శ్రమపడియుండిరికాని చివరకుఁ దెలిసికోలేకపోయిరి! అందుచేతనే వారికి హిందూదేశ మెందుచే బీదదశకు వచ్చెనో బోధపఱుచుటకయి ప్రసిద్ధివహించిన డిగ్బీదొరగారొకపెద్దగ్రంథము వ్రాసియుండిరి. అందు డిగ్బీదొరగారు సందర్భవశమున నీక్రిందిరీతిని వ్రాసియున్నారు.—

“హిందూదేశములో క్షామముచేఁ బీడింపఁబడుచున్న బీదజనుల సహాయార్థమై ముష్టిచిప్ప పట్టుకొని చందాలు వేయవలసినదని దేశదేశములవారిని 1900వ సంవత్సరములో లార్డు కర్జనుగారు బ్రతిమాలుకొన్నప్పుడు, అమెరికాదేశస్థులు హిందూదేశస్థులకేల యీయవలెను? అను ప్రశ్న వచ్చెను. ఇంగ్లీషువారు హిందూదేశమునకుఁ జేయవలసియున్న ధర్మమును ఉపేక్ష చేయుటచే హిందువులు లక్షలకొలఁది పస్తుండవలసినవారగుచున్నారుగనుక యని దానికి సమాధానము చెప్పఁబడెను.”

ఈకాటకములు నాటినాటికిఁ దలసూపి మనదేశము క్షీణించుటకుఁ గారణము లెవ్వియో ముందుప్రకరణములయందు వివరవివరముగా విచారింతము.





## మూడవ ప్రకరణము.

### మనరాబడి.

ఇంతపంట పండెడుదేశములో నెంతరాబడి యుండునో తెలిసికొనుటకయి చాలమందిహృదయములలో నొకకోరిక స్వాభావికముగా జనింపవచ్చును. మనదేశముమీఁద సవతితల్లి ప్రేమను జూపిన లార్డు కర్జనుగారుసైతము మనదేశస్థులలో మొత్తముమీఁద నొక్కొక్కనిరాబడి సంవత్సరమునకు ముప్పదిరూపాయ లని సెలవిచ్చిరి. మనదేశస్థులలో నాయకమణిగా నెన్నఁదగు దాదాభాయి నౌరోజీగారును ముప్పదిసంవత్సరముల క్రిందట ముప్పదిరూపాయలే మనదేశస్థుల రాబడి యని చెప్పిరికాని యిప్పు డది తగ్గినదనియే వారియభిప్రాయము. ఈహూణపరిపాలనము వచ్చినవెనుక మనరాబడి క్రమక్రమముగా క్షీణించుచున్నదని దొరతనమువారిలెక్కల నెల్ల పరిశోధించి ప్రసిద్ధిఁగన్న డిగ్బీదొరగారు వ్రాసి వాసిగన్న గ్రంథమునుబట్టి చక్కఁగాఁ దెలియవచ్చుచున్నది.

1850వ సంవత్సరములో మనదేశస్థులయం దొక్కొక్కనికి ఒక్కొక్కదినమునకు రాబడి 2 అణాలు అయియుండెను. అదియే 1882వ సంవత్సరమున లెక్కలప్రకారము $1\frac{1}{2}$ అణాలకు దిగెను! అటుతరువాత మనదేశములో పంటలు మొదలగునవి వృద్ధియైనను, వాణిజ్యాదికములవలన ధనసంపాదనమునకు అవకాశములు పెక్కులు చిక్కినను, అది యేమి పాపకర్మమో కాని యీయన్నివిధములగువానివలనను మనకు 1900వ సంవత్సరములో వచ్చెడురాబడి దినమునకు 9 పైసలని తేలినది!

ఇతరదేశములవారి రాబడితోఁ బోల్చిచూచినయెడల మననిర్భాగ్యదశ మఱింత కరతలామలకము కాఁగలదు.

ఒకసంవత్సరములో మొత్తముమీఁద నొక్కొక్కని వచ్చుబడి వివిధదేశములలో నీక్రిందివిధమున నున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్కాట్లండు | రూ | 675 | హాలెండు | రూ | 330 |
| ఆస్ట్రేలియా | ,, | 600 | నార్వే | ,, | 300 |
| యునైటెడ్డురాష్ట్రములు | ,, | 585 | స్విడ్జర్లాండు | ,, | 285 |
| బెల్జియము | ,, | 420 | స్పెయిను | ,, | 240 |
| ఫ్రాన్సు | ,, | 405 | ఆస్ట్రియా | ,, | 225 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| కనడా | రూ | 390 | రష్యా | రూ | 180 |
| జర్మనీ | ,, | 330 | హిందూదేశము | ,, | 16-12-0 |

ఒక్క మనచెన్నపురిరాజధానిలోని స్థితిగతులనుగూర్చి యించుక విచారించుదము.

వ్యవసాయమువలన రాబడిగాక మనరాజధానిలో కాఫీ మొదలగువాని అమ్మకము వలననుండియేగాక, కలప, ప్రత్తి, తోళ్లు, చేపలు, చమురులు, మొదలగువానివలనగూడ రాబడి వచ్చుచున్నది. ఈ అన్నివిధము లయినవానివలనను మనరాజధానిలో వచ్చెడి రాబడి మొత్తము 539597415 రూపాయ లయియున్నది. మనరాజధానిలోని జనసంఖ్య 38,208,000. కాఁబట్టి యీజనసంఖ్యచే మొత్తము రాబడిని భాగించినపక్షమున నొక్కొక్కమనుష్యునకు సంవత్సరమునకు రాబడి రూ 14-2-0 అగుచున్నది. అనఁగా దినము 1 కి సుమారు 7 పైసలగుచున్నది!! దినమునకు రెండుకానులతోనే మనుష్యుఁడు బ్రతుకనేర్చును? మనకు దినము రాబడి తెల్లవానికిఁ గాల్చిపాఱవేయుటకయి యొక్క భాగాకుచుట్టముక్కవిలువ కయినను చాలదే, మన మిట్టిఘోరదారిద్ర్యములో మునిఁగి తేలుచుండఁగా నెవ్వఁడు నోరుపెట్టుకొని మనహిందువులు భాగ్యవంతులని చెప్ప సాహసించును? కడపజిల్లాలో మూఁడువారములు ప్రయాణము చేసిన యొకదొరగా రిట్లు వ్రాయుచున్నారు. "నే నెక్కడకుఁ బోయి బసచేసినను నాగుడారముచుట్టును నిరంతరముగ 'తిండిలేక చచ్చిపోవుచున్నాము' అను ఒక్కవాక్యముమాత్రమే నా చెవులఁ బడఁజొచ్చెను." మఱియొకదొరగా రిట్లు వ్రాయుచున్నారు. "ఈసంవత్సరము పండినపంట జనులకు కొన్నివారములకుమాత్రమే సరిపడునదిగా నున్నది. ఆటువెనుక వారందఱు నుపవస్తుండవలసినదే. ఇప్పుడే జనులు రెండుమూఁడుదినముల కొక్కమాఱు మాత్రమే భోజనము చేయుచున్నారు. రెండుదినముల కొక్కతిండి దొరకినయెడల మాకింక కావలసినదిలేదు అని యొకక్రైస్తవుఁడు నాతోఁ జెప్పియున్నాఁడు. మూఁడు నాలుగువందలజనులను ఒకచోటఁ జేర్చి వారి కెంతెంత రాబడి వచ్చుచున్నదో బాగుగా బరీక్షించి యుంటిని. ఒక్కొక్కనికి దినము 1 కి ఒక అణాకంటె తక్కువగా నున్నట్లు తేలినది. క్షామమే వచ్చినచో లక్షలకొలఁది జనులు చచ్చుటకు సిద్ధముగా నున్నారు" ఇట్టిదుస్థితి కెల్లను గలకారణములను ముందు పరీక్షింతము.



## నాలవ ప్రకరణము.

## పన్నులు.

"పన్ను హిందూదేశమునం దంత స్వల్పముగా మఱే యేనాగరికతనందిన దేశమునందును లేదు. హిందూదేశములోని బ్రిటీషుపరిపాలనము కేవలము సదుద్దేశములతోఁ గూడుకొన్నదేగాక, కార్యములందును లోకమునం దెల్ల మిక్కిలి క్షేమకరమైనదిగా నున్నదని జాన్ స్టూవార్టు మిల్లుగారు వచించిరి. వారు చెప్పినమాటయం దిప్పటికిని ఎక్కువ సత్యమున్నదని నానమ్మకము." అని చాలకాలము మనదేశములో దొరతనమువారియుద్యోగముక్రింద నుండి తుదకు రాజద్రవ్యమునకు సంబంధించిన మంత్రిపదమును వహించిన సర్ జాన్ స్ట్రాచీదొరగారు వక్కాణించి యుండిరి. దొరతనమువారి యుద్దేశము లెంతటిసదుద్దేశములైనను ఫలములుమాత్ర మట్టివి కావని డిగ్బిదొరగారు వ్రాసియున్నారు. స్ట్రాచీదొరగారునొక్కివక్కాణించునట్లుగా మనదేశమున దొరతనమువారిచే విధింపఁబడుపన్ను అంత తక్కువైనదేమో విచారింతము. పన్నులయొక్క యెక్కువతక్కువలు జనులయొక్కసంపాదనమునుబట్టి విచారింపవలెనని మూల్హాలుగారు తమనిఘంటువులో వ్రాసియున్నారు. ఈయంశమునుమనము జ్ఞప్తియందుంచుకొని పరీక్షించినపక్షమున స్కాట్లండుదేశమునందలి పన్నుకంటె రమారమి నాలుగురెట్లు మన మెక్కువ చెల్లించుచున్నామని డిగ్బిదొరగారు లెక్కవలనఁ గనఁబఱిచిరి.

ఇంకను సూక్ష్మముగాఁ బరికించినయెడల మఱికొన్ని విచిత్రములైనయంశములు బోధపడును. మనదేశస్థులలో 231,085,132 మందిలో 230,000,000 మందికి సంవత్సరమునకు ఒక్కొక్కనిరాబడి 12 షిల్లింగులుమాత్రమే యని డిగ్బిదొరగారు నిర్ధారణ చేసియుండిరి. 1900 సంవత్సరములో దొరతనమువారికి వచ్చిన రివిన్యూరిసీట్లమొత్తమును పంచిచూచినపక్షమున నొక్కొక్కఁడు 6 షిల్లింగులపన్ను చెల్లించుచుండెనని రమేశచంద్రదత్తుగారు వ్రాసియుండిరి. దీనినిబట్టి మనదేశస్థులు ముప్పాతికమువ్వీసము తమ

రాబడిలో సగము పన్నులక్రిందనే చెల్లించుచున్నా రని బోధ పడుచున్నది కదా!

ఇతరదేశములలో జనులు చెల్లించు పన్నుకంటె హిందూదేశములోఁ జెల్లించునది మిక్కిలి తక్కువగా నున్నదని యంకెలనుబట్టిమాత్రము చూచి స్ట్రాచీదొరగారివలెనే యనేకులు భ్రమకు లోనగుచుందురు. ఎక్కువరాబడి గలవారు ఎక్కువ పన్ను చెల్లింపఁగలరు. మదపుటేనుఁగు ఎన్నిటన్నుల బరువైనను మోయఁగలదు. నాలుగేండ్లబాలుఁడు కొద్దిబరువునకే క్రుంగిపోవును. సీమలోనొక్కొక్కఁడు చెల్లించుపన్నకంటెమనదేశములో నొక్కొక్కనిరాబడియే యెంతో తక్కువగానున్నదికదా యని దాదాభాయిగారు వ్రాసిరి.

ఈపన్నులభారముచేత మనదేశస్థులు నానాఁటికి బీదలగుచు నశించుచున్నారు. మనదేశములో నిప్పుడు దాదాపు ముప్పదికోట్లజను లున్నా రని చెప్పవచ్చును. అందు నూట నెనుబదిమంది కేవలమువ్యవసాయమువలన జీవించువారుగ నేయున్నారు. అట్టివారిస్థితి యెట్లున్నది? జనులలోఁ జాలభాగము కడు దరిద్రులుగా నున్నారని మనలనుగూర్చి సర్ జార్జి కాంబెలుగారు నుడివిరి. అగ్రికల్చరల్ రిపోర్టరుగా రగు రాబర్ట్సన్ దొరగారు మనదేశములోని సేద్యగాండ్రస్థితినిగూర్చి యిట్లుచెప్పుచున్నారు.—

"నాగరికత నందిన దని చెప్పకొను ఏదేశమునకుఁగాని యాతని (సేద్యగాని) స్థితి యవమానకరమ్ముగా నున్నది. బాగుగా పండినకాలములయందే యతనికిని అతని దారపుత్రాదులకును గలిసి సంవత్సరముపొడవునను దినము 1కి 2 అణాలకంటె నెక్కువ రాబడి రాదు. ఇఁక పంట బాగుగా పండనికాలములయం దాతనిస్థితి యెంత దుఃఖకరమయినదో చెప్పఁబనిలేదు." 1881వ సంవత్సరమున సర్ హంటరుదొరగారు హిందూదేశములో 40,000,000 జనులు ఆహారము చాలకయే జీవింపవలసినవా రగుచున్నారని యొప్పుకొనిరి. తిన్నఁగా శోధించినయెడల నీకాలమునందు దాని కన్నిరెట్లు జనులు తిండిలేక మలమలమాడుచుఁ గాటకములవాతఁ బడుచున్నారో తెలియునుగదా! 1882వ సంవత్సరమున సర్ ఇ. జేరింగుదొరగారు ఇట్లు వ్రాక్రుచ్చియుండిరి.—

"హిందూదేశములో సంవత్సరమునకు ఒక్కొక్కని రాబడి 27 రూపాయల





కంటె నధికముగా లేదని లెక్కవేయఁబడెను. ఈలెక్కయం దెంతమాత్రము తప్పులేదని నేను నిర్ధారణచేసి చెప్పలేను; కాని, హిందూదేశములో పన్నులు చెల్లించు జనులు మిక్కిలి బీదవారుగా నున్నారని రుజువుచేయుట కదియే చాలియున్నది. అంతటిబీదజనులనుండి యింక నేమాత్రము ఎక్కువ రివిన్యూ రాబట్టఁ జూచినను అది యసాధ్యము. ఒకవేళ సాధ్యమయినను అన్యాయము."

అయినను నానాఁటికి రివిన్యూ వృద్ధి యగుచున్నట్లు ఎల్లరకును దెలిసినయంశమే కదా. 1792వ సంవత్సరము మొదలుకొని 1838వ సంవత్సరమువఱకును గల 46 సంవత్సరములకాలములో నింగ్లీషుదొరతనమువారికి మనదేశమునందు వచ్చినరివిన్యూమొత్తము సుమారు 779 కోట్ల రూపాయలు. ఇటీవల 18 0వ సంవత్సరము మొదలుకొని 1900ల సంవత్సరమువఱకును గల పదిసంవత్సరములకాలమునందే సుమారు 9,420,710,915 రూపాయలు రివిన్యూక్రింద వసూలు చేయఁబడెను.

ప్రస్తుతము దొరతనమువారు భూమిపై మాటిమాటికి విధించెడిపన్నులపద్ధతి ధర్మవిరుద్ధముగా నున్నది. రయతువారీపద్ధతిచొప్పున భూమిమీఁద పన్ను ఒక్కమాటే విధింపఁబడె ననియు, దానిని మార్పరా దనియు సర్ థామసు మన్రోదొరగారే సెలవిచ్చిరి. మదరాసుగవర్న మెంటువారు ఇండియా గవర్న మెంటువారికి వ్రాసిన యొకయుత్తరములో (1862) "రయతువారిపద్ధతియొక్క ముఖ్యనియమ మేమనఁగా దొరతనమువారు భూమిమీఁదఁ గట్టెడి పన్ను స్థిరపఱుపఁబడిన దనుటయే. ఈయంశమునకు నెవ్వరు నడ్డము చెప్పలేరు" అని వ్రాసి యుండిరి. ఇది యిట్లుండఁగా మాటిమాటికిని సెటిల్ మెంటు లనుపేర భూమిపన్నుమార్చుచుండుట న్యాయమగునా? ఈయంశమునుగూర్చియే జస్టిస్ యస్ సుబ్రహ్మణ్య అయ్యరుగారు ఇట్లువక్కాణించిరి —

"ఇప్పుడవలంబించుపద్ధతి యేమి? అప్పు డప్పుడు జరగు సెటిల్మెంటుల వ్యవహారమంతయు రహస్యముగా నడపఁబడుచున్నది. ఈరీతిగా పన్నులు పెంపుచేయుపద్ధతి స్వాభావికముగా దుర్మార్గముగా నున్నది. ఇంగ్లీషువారి పరిపాలనా పద్ధతులప్రకారము చట్టముల నిర్మించు నధికారులయాజ్ఞ లేనిదే యెట్టిపన్నైనను గట్టఁగూడదు. దీనికి వ్యతిరేకముగా రివిన్యూఆఫీసరుల చిత్తానుసారముగా నీపన్నులుఁవృద్ధి చేయఁబడుచున్నవి. పెక్కుశతాబ్దములనుండి జనుల యాస్తిగానున్న లక్షలకొలఁది యెకరముల భూమి దొర

తనమువారియాస్తి యని చెప్పుట నామనస్సునకుఁ జూడఁగా భూస్వాములను మిక్కిలి యవమానపఱచుటయయి యున్నది.” (మార్చి 24, 1907,—మదరాసు స్టాండర్డు పత్రికఁ జూడుఁడు.)

సెటిల్ మెంటు లనుపేర భూమిపన్నులను అక్రమముగాఁ గట్టుటను సమర్థించుకొనుటకయి వెనుక ఇండియాసెక్రటరీగానున్న ఫౌలరుదొరగారు, భూమి దొరతనము వారిది గాని రయితులది కాదనియు, అది బాడుగ కిచ్చిన దగుటచేత నాపన్ను అద్దెయే కాని వేఱు కాదనియు నొక క్రొత్తపన్నుగడను బన్నెను!

రిక్కార్డుదొరగారు తమసాక్ష్యములో, హిందూదేశమున పండెడి మొత్తముపంటలో సగము దొరతనమువారికి పన్నులక్రింద పోవలెననుపద్ధతిచేతను, ఆదుపు ఆజ్ఞలలోఁ బెట్టుటకు వీలు లేనంతమంది ఆఫీసరులను రివిన్యూ పోగుచేయుటయందు నియమించుటచేతను, జనులు జీవించుటయే యసందర్భ మనియు, చాలవిషయములలో పన్నులమితముగా నుండి యొక్కొక్కప్పుడు అసలు భూమిమీఁద పండెడుపంట విలువకంటె అధికముగా పన్నులు విధింపఁబడుచున్న వనియు, అట్టిపద్ధతులమీఁద నడపఁబడు దొరతనము క్రింద జనులు భాగ్యవంతులయి పెంపొందుట దుస్సాధ్య మనియు వక్కాణించిరి.

పంటపండించుభూమి యెంత వృద్ధియయినదో యించుక విచారింతము. 886వ సంవత్సరములో పంటపండించినభూమి 182,750,000 యెకరములు. 1898వ సంవత్సరములో 196,497,232 యెకరములు. అనఁగా వృద్ధియైన యెకరములు 13,74",232. ఈసందర్భమున నొకయంశమును జ్ఞప్తి నుంచుకోవలెను. 1880వ సంవత్సరముతరువాత బ్రిటీషు రాష్ట్రము 105,000 చదరపుమైళ్ళు అనఁగా 67,200,000 యెకరములు విస్తీర్ణమయ్యెను. ఇట్లు రాష్ట్రమున కధికముగాఁ జేర్చబడినభూమిలో 3,167,133 యెకరములు అప్పరుబర్మాలోనిదై యున్నది. ఈకాలములోపలనే జనసంఖ్య యెంత వృద్ధి యయినదో పరీక్షింతము.

| | | | | |
|---|---|---|---|---|
| బ్రిటీషు ఇండియాలో | 1880 | సంవత్సరములో | జనసంఖ్య | 191,000,000. |
| ,, | 1900 | ,, | ,, | 231,085,132. |
| వృద్ధి | | | | 40,085,132. |





కాఁబట్టి బ్రిటీషు ఇండియాలో వృద్ధియయిన యీ 40,085,132 జనులు జీవించుటకు గాను 10,000,000 యెకరములకంటె యెక్కువ వృద్ధి కాలేదు. తరువాత అప్పరుబర్మాలోనిజనులు జీవించుటకుఁగూడ యీ పైభూమియే యాధారమయ్యెను. ఈయంశములను లోతుగాఁ దఱచిచూచినపక్షమున, లార్డుకర్జనుగారు వ్యవసాయము వృద్ధియయిన దన్నమాటయం దెంతవఱకు సత్య మున్నదో తెలిసికోవచ్చును. పోనీ, భూమి యెక్కువపంట నిచ్చుచున్నదా యన్న దొరతనమువారిలెక్కలనుబట్టి సైతము ఒకటిరెండుభాగములఁ దక్క తక్కినభాగములయందు భూమి నిస్సారమయి తక్కువపంట నిచ్చుచున్నట్లు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. ఇట్లు భూమి నిస్సారమయి రయితు నానాటికి బీదవాఁడయి యప్పులపాలయి ముప్పు గుడుచుచుండుటకుఁ గారణము, వానికి తనభూమి మీఁద నపేక్ష పోవుటయే. ఏమార్పు చేసిన నేపన్నువచ్చునో, యేపంట మార్చిన నే క్రొత్తపన్నో యని చెప్పి రయితు భూమియొక్క బలాబలములను, వృద్ధిని, మార్పులను గూర్చి విచారించుట లేదు.

ఇంతటిబీదస్థితిలో మునిఁగియున్న జనులపై రాబడి పన్నుకూడ విధింపఁబడుట శోచనీయము. ఈరాబడిపన్నునుబట్టియే మననిర్భాగ్యదశ తేటతెల్ల మగుచున్నదని పార్లమెంటు మెంబరయిన శామ్యుయల్ స్మిత్తుదొరగారు 1894వ సంవత్సరములో నిట్లు సంభాషించిరి —

“హిందూదేశమున సుమారు 220,000,000 జను లున్నప్పటికిని, ఇంగ్లాండుదేశస్థులు 38,000,000 మంది అయినప్పటికిని, ఇంగ్లీషువారికంటె ఇండియనులే పదిరెట్లు తక్కువ రాబడి పన్ను చెల్లించుచుండుట చూడఁగా, ఇండియను లెంత బీదవారో స్పష్టమగుచున్నది సీమలో పదిలక్షలజనులు చేరి యిచ్చెడి రాబడిపన్నులో ఇండియాలో అంతమంది జనులే యఱువదియవవంతు గాని యీయలేకున్నారు. ఈయంశమే ఇండియనులు బీదవారని బోధింపకున్న మఱి యేదియు బోధింపదు. ఇండియాలో నెంత తక్కువద్రవ్యమున్నదో యూహించుటకే కష్టసాధ్యముగా నున్నది.”

ఇట్టినిరుపేదలనుండి యిన్కంటాక్సు రాబట్టుటలో నుద్యోగస్థులు ప్రజల నెట్లు పీడింతురో యెల్లరు నెఱుంగుదురు. దీనికిఁ దార్కాణముగా పంజాబులో జరగిన యొక దృష్టాంతమును డిగ్బిదొరగారు చూపుచున్నారు.—

“గతవత్సరము (1900) దామోదరకోలీ యనునతఁడు తనపై 28 రూపాయల ఇన్‌కంటాక్సు అనఁగా వచ్చుబడిపన్ను విధింపఁబడెనని వినెను. ఆమాట విన్నతోడనే యతఁడు నిశ్చేష్టితుఁ డయ్యెను. అంతసొమ్ము తెచ్చుటకుసైతము అతనికి శక్తిలేక యుండెను. వెంటనే యతఁడు తనయశక్తతను దెలుపుకొనుచు అధికారులకు విన్నపము పంపుకొనెను. ఆవిన్నపముయొక్క పర్యవసాన మేమనఁగా పన్ను వెంటనే చెల్లింపక జాగు చేసినందునకుగాను 7 రూపాయలు జరిమానా యతనిపై విధింపఁబడెను. పన్ను చెల్లింపలేకయుండినప్పు డీజరిమానాకూడ నెట్లు చెల్లింపఁగలఁడు? అధికారులు వచ్చి యతనికొంప వెదకిరి. విలువయినపదార్థ మొక్కటియు నందుఁ గానఁబడదయ్యె. తరువాత వతనిదుకాణమునకుఁ బోయి యందలివస్తువుల నెల్ల నమ్మఁగా 2 రూపాయలుమాత్రము వచ్చెను. తరువాత వానికొంప అమ్మఁబడెను. అందుపై 65 రూప్యములు వచ్చెను. సర్కారుకు చెల్లింపవలసిన 28 రూపాయలును రూ 7 ల జరిమానాయు ఆసొమ్మునుండి తీసి మిగిలినసొమ్ము మఱునటిసంవత్సరము పన్నునకుగాను జప్తిచేసి యుంచఁబడెను. రెండురూపాయలవర్తకము చేసికొనుచు, రూ 65 ల విలువగల కొంపలో జీవించు నిఱుపేదకు 28 రూపాయల వచ్చుబడి పన్ను గట్టుటయన నెట్టిదో విచారింపుఁడు.”

మనము చెల్లించుపన్నులవిలువ యెంతయో, యవి యెట్లు వ్యయపఱుపఁబడుచున్నవో సంగ్రహముగా జగదీశచంద్రఘోషుగారు తెలియఁబఱచినదానినే యిందుఁ బొందుపఱుచుచున్నాను.

| మొత్తమురాబడి | కోట్లు | మొత్తము ఖర్చు | కోట్లు |
|---|---|---|---|
| భూమిపన్ను రూ. | 20 | రైల్వే మొదలగునవి రూ. | 33 |
| నల్లమందు ,, | 10 | సైన్యము ,, | 30 |
| ఉప్పు ,, | 8 | పబ్లికు అప్పుమీఁద వడ్డి ,, | 11 |
| స్టాంపులు ,, | 5 | వసూలు చేసినందుకు ,, | 15 |
| తీరువ (ఎక్సైసు) ,, | 7½ | శాసననిర్మాణము, కోర్టులు ,, | 6 |
| ప్రొవిన్షియలురేట్లు ,, | 4 | రాజకీయవ్యయము ఇతర | |
| సుంకములు ,, | 6 | పరిపాలనావ్యయము ,, | 10 |
| ఫోరెస్టు ,, | 2 | విద్యకొఱకు ,, | 1 |





| మొత్తమురాబడి | కోట్లు | మొత్తము ఖర్చు | కోట్లు |
|---|---|---|---|
| రిజస్ట్రేషను ,, | ½ | పోస్టు, టెలిగ్రాఫు మొ. ,, | 3 |
| ఇతరము లైనపన్నులు | 2 | ఇతరము లైనఖర్చులు ,, | 11 |
| రైల్వే, పోస్టు మొదలగువాని వలన వచ్చినవి ,, | 52 | మొత్తముఖర్చు | 120 |

దొరతనమువారిరాబడి మొత్తము 127 కోట్లు

ఈసందర్భమున మఱియొక యంశమును మనము జ్ఞప్తి నుంచుకోవలెను. వ్యయము పోఁగా మిగిలినసొమ్ము ఎట్లుపయోగపఱుపఁబడుచున్నదో యొకింత విచారింపవలెను. దీనింగూర్చి గోపాలకృష్ణగోఖలేగా రిట్లు చెప్పుచున్నారు.

“మన ‘నెట్టు’ రివిన్యూ 640,000,000 రూపాయలయి యున్నది. ఇందులో సగము సైన్యముక్రిందనే మ్రింగివేయఁబడుచున్నది. మిలిటరీకర్చులుగాక ‘హోము చార్జసు’ క్రిందనే యందు మూడవభాగము పోవుచున్నది. ఈరెండునుగలిసి మొత్తము 64 కోట్లరూపాయలలో 51 కోట్లను లాగివేయుచున్నవి. తక్కినసొమ్ములో దాదాపు 5 కోట్లరూపాయలు యూరోపియను సివిలు ఆఫీసరులజీతములకే పోవుచున్నది. కాఁబట్టి ఇతరవ్యయములకొఱకయి దొరతనమువారిచేతిలో నిఁక 7 కోట్లుమాత్రమే మిగులుచున్నవి. ఇట్లుండఁగా దొరతనమువారు మనదేశమున విద్యనిమిత్తము ఒకకోటిరూపాయిలుమాత్రమే వినియోగించుచున్నా రన్నప్పు డేమి యాశ్చర్య మున్నది?”

మఱియు గవర్నమెంటు ఆఫీసరులలో జీతము లెట్లున్నవో చూడుఁడు. యూరోపియను ఉద్యోగస్థులకు 21 కోట్లును, యూరేషియనులకు 1½ కోట్లును, జీతము లీయఁబడుచున్నవి. ఇండియనులకు 5 కోట్ల 25 లక్షలుమాత్రమే యీయఁబడుచున్నది. ఇదిగాక మనదేశమునకు సంబంధించిన సివిలు ఆఫీసరులలో యూరోపియనులు 8000 మందిమాత్రమే యున్నను వారికి 8 కోట్లరూపాయలజీతమును, ఇండియనులు 1,30,000 మంది యున్నను 7 కోట్లరూపాయలజీతమును ఈయఁబడుచున్నవి. మొత్తముమీఁదఁ జూచినపక్షమున నీజీతములు ఒక్కొక్కయూరోపియను ఉద్యోగస్థునకు 9,005 రూపాయలును, యూరేషియనునకు 1215 రూపాయలును, ఇండియనునకు 540 రూపాయలును వచ్చుచున్నవి.

వీనినిబట్టి చూడఁగా “హిందూదేశమునందు పన్నులు పూర్వము మొగలాయి పరిపాలనమునందుకంటె తేలికగా నిప్పు డున్నమాట వాస్తవమే. కాని యాసొమ్ము మొగలాయిచక్రవర్తులు పుచ్చుకొనలేదు. మనము (ఇంగ్లీషువారు) పుచ్చుకొనుచున్నాము. ఈమనపద్ధతివలన వ్యవసాయదారులు వృద్ధికాకుండునట్లు ఆటంకపఱుచుచున్నది.” అని లండన్ స్పెక్టేటరుపత్రిక వెనుక వచించినదానిలో నెంతయు సత్యమున్నదని గ్రహింపవచ్చును.







## ఐదవ ప్రకరణము.

## ధనప్రవాహము.

---

దొరతనమువారు పన్నులక్రింద నెంతధనము గ్రహించినను దానిని మనదేశమునందే వ్యయపరచిన పక్షమున మన మెంతమాత్రమును దారిద్ర్య మనుభవింపఁ బనిలేదు. కాని మన ప్రస్తుత దొరతనము వారువిదేశస్థులగుట చేతను, దేశాధికారము సర్వమును వారి యధీనమై యుండుటచేతను, పన్నులక్రింద గ్రహింపఁబడినసొమ్ము చాలభాగము విదేశము పాలుగాక మానదు. స్వరాజ్యముకల దేశములలో నట్లుకాదు. ఇంగ్లాండులో దొరతనము వారు ప్రజల నుండి పైకొనిన ధనములోఁ బైస దగ్గఱనుండి మరల నెవ్విధముననో యొకవిధమున నా పన్నులిచ్చిన ప్రజల చేతులలోనికే వచ్చుటచేత మొత్తముమీఁద దేశముదరిద్రమగుట కవకాశము లేదు. అట్లుగాక మనదేశధనము ఏటేటను బలువిధముల బయటికిఁ బోవుచున్నది. వానినెల్ల నిట నెన్నఁ దరముకాదు. కాని వానిలోఁ గొన్నింటిని మాత్ర మిందు సూక్ష్మముగాఁ దెలియఁబఱుప వచ్చును. మనదేశమునందు పెద్ద జీతములుగల గొప్పయుద్యోగస్థులందఱును సీమవారే యగుటచేత, వారి జీతముల యందీదేశమునసైన వ్యయములుపోఁగా మిగిలిన యాదాయమును, వా రిక్కడ నున్నప్పుడు పంపెడి ధనమును, వారు తమ యుద్యోగ మైనవెనుక సీమలోఁ గూరుచుండి గ్రహియించెడి పింఛనుల మొత్తమును, మనదేశ ధనమే యైయున్నది.

మనదేశమునందు పలువిధములైన వ్యాపారములు నడపుటకై యింగ్లీషు వారిచేఁ బెట్టఁబడిన పెట్టుబడి మీఁద వచ్చెడి వడ్డియు లాభమును మన దేశధనమే యై యున్నది. హోము చార్జ సనుపేర నేటేటను బోయెడి ధనమును మనదేశ ధనమే యై యున్నది. ఈ యంశమునుగూర్చి బాగుగాఁ బరిశోధించిన పార్లమెంటు మెంబరయిన అల్ఫ్రెడు వెబ్బుగా రిట్లు చెప్పిరి :

“లండనులో నున్న యిండియా ఆఫీసున కగు కర్చులకును, ఇండియాలోఁ బని చేయుటకై సీమలో క్రొత్త సిపాయిలను సంపాదించుటకును, ఇంతకు మున్ను ఇండియాలో నౌకరీచేసి యిపుడు ఇంగ్లాండులో నివసించుచున్న సివిలు మిలిటరీ యుద్యోగస్థుల పింఛనులకును, ఇండియాలో నుద్యోగము చేయుచు నప్పు డప్పుడు సెలవులమీఁద సీమకుఁ బోవు వారి కిచ్చెడు వేతనములు దారికర్చులు మొదలగు వానికిని, ఇండియా

సైన్యమునకై యింగ్లాండులో సమకూర్చెడి సామగ్రి మొదలగు వానికిని, ఇండియా నుండి స్వంతకార్య సంబంధమైన జనులచేఁ బంపఁబడిన సొమ్మునకును, సరకులకును, ఇంగ్లాండులోని అప్పుల వాండ్రకు ఇండియా దేశముయొక్క యప్పు మీఁద నిచ్చెడి వడ్డీకిని, ఇండియాలోని రైల్వేల నిమిత్తమై యింగ్లాండులోఁ జేసిన యప్పుల మీఁద భాగస్వాముల కిచ్చెడు వడ్డికిని, 2 కోట్ల 50 లక్షల పౌనులు మొదలు 3 కోట్ల పౌనుల వఱకును (రమారమి 40 కోట్ల రూపాయిల వఱకును) ప్రతి సంవత్సరమును ఇండియా దేశమునుండి తీసికొని పోఁబడి సీమలో వ్యయపఱుపఁ బడుచున్నది.''

ఈ సందర్భమున జే. టీ సండర్లండు యమ్-ఏ. గారిట్లు వ్రాయుచున్నారు. ''ఇండియాలోని ప్రస్తుత స్థితిగతులు బాగుగా నున్నవని చెప్పువారందఱును ఇండియా దేశము భాగ్యవంతముగా నున్నదని చెప్పుదురు. ఒక విధముగా జూచినచో నీమాట యందు సత్యమున్నది. అయినను ఆభాగ్య మెవ్వరిది? ఇండియా దేశభాగ్యము బ్రిటీషు వారిది గాని ఇండియనులది కాదు. సమస్తమైన యధికారమును బ్రిటీషు వారికే చెంది యున్నది. వారే చట్టముల నిర్మింతురు. వారె తమ జీతముల నిర్ణయించు కొందురు. వారికిం దగు నుద్యోగపదవుల వారె కలుగఁ జేసికొందురు. స్వాతంత్ర్యముల నిచ్చుటయందేమి, యెగుమతి దిగుమతిసరకులపై సుంకములు గట్టుట, నాణెముల ముద్రించుట యందేమి, దేశముయొక్క యంతర్వాణిజ్యము విదేశ వాణిజ్యము టెలిగ్రాపులు రైలుమార్గములు మున్నగు వానియందేమి యధికారముగలవారు వారె యై యున్నారు. ఇట్లుండఁగా వారు భాగ్యవంతులుగ నున్నారనుటలో నేమి వింతయున్నది?''

భరతఖండము నందుఁ జక్కని పంటలు పండుటకు కొదువ లేదు. అయిననేమి లాభము? దేశము ధనవంతమైన కొలఁదిని జనులు దరిద్రులగుచున్నారు! ఈమాట విన్న సాధారణ జనులకు నమ్మశక్యముగా నుండదు. వెనుక సీట్లు ఇండియాకంపెనీవారు బంగాళా బీహారుదేశములు తమ వశమైన తరువాతఁ గ్రమక్రమమున క్షీణదశనందుం చుటఁ జూచి దీనికి హేతువు లేవైయుండునని 1807-1816 సంవత్సరముల మధ్యగల తొమ్మిది యేండ్ల కాలములోఁ జక్కగాఁ బరీక్షించి యుండిరి. ఆ రికార్డుల నెల్ల శోధించి యుండిన మార్టినుదొర గారు ఈక్రిందివిధమున దాని సారాంశమును దెలియఁ బఱిచిరి:

''మిగుల విచిత్రములుగఁ గన్పట్టెడు రెండంశముల మాత్ర మిక్కడఁ జెప్పక తప్పదు. అవి యెవ్వియనఁగా, ఈ పరీక్షింపఁబడిన దేశములు భాగ్యవంతములుగా నున్న





వన్న మాట యొక్కటియు, అందలి జనులు నిర్భాగ్యులుగా నున్నారనమాట యింకొక్కటియు.''

దేశము సంపన్నముగా నుండియు జనులు దారిద్ర్య మనుభవించు చుండుటకుఁ గారణము, ఈదేశమునుండి యేటేట ప్రవాహమువలె ధనము విదేశములకుఁ బోవుచుండుటయే యని మార్టిను దొరగారే నిర్ధారణ చేయుచున్నారు.

''బ్రిటీషు ఇండియానుండి సంవత్సరమునకు 30,000,000 రూపాయిలు ప్రవాహరూపకముగాఁ బోవుచున్నవి గనుక, హిందూదేశములో సాధారణముగా నిచ్చెడు నూటికి 12 కాం పొందు వడ్డిచొప్పునఁ జూచిన పక్షమున, ముప్పది సంవత్సరముల కాలములో 7,23 ,000,000 రూపాయిల విశేష మొత్త మగుచున్నది. ఇంత సొమ్మే క్రమక్రమముగా మితిమీఱి పోవుచుండెను పక్షమున నింగ్లాండు దేశము సైతము తక్షణమే నిర్భాగ్యము గాక మానదు. అట్టి సందర్భమున దినమంతయుఁ గష్టపడినచోఁ గూలివానికి రెండు మూడణాలకంటె నెక్కువ రాని యిండియా దేశములో నింతటి ధనప్రవాహము వలని ఫలము లెంత క్రూరముగా నుండునో వేఱె చెప్పఁ బనిలేదు.''

హిందూ దేశమునుండి విదేశములకీ ప్రసిద్ధపురుషులు పోవుచున్నదన్న ధనప్రవాహము వారు చెప్పిన కాలముకంటె నిప్పుడు మిక్కిలి యెక్కువగా వృద్ధిఁ జెందిన దని యెల్లరకును దెలిసిన యంశమే యైయున్నది దీనికి హేతువేమి? ఆర్. యన్. కస్టు దొర గారు తమ యుపన్యాసములు రెండవభాగము ఏడవ యధ్యాయములో నిట్లు చెప్పుచున్నారు.

''ఎడతెఱపిలేక హిందూదేశమునుండి యింగ్లాండునకు ధనము లాగివేయఁబడుచున్నది. ఇండియాలో సంపాదించిన సంపాదనలచే నింగ్లీషు వారు నానాఁటికి క్రొవ్వి బలియుచుండ, నిండియా దేశస్థుఁ డెప్పటివలె బక్క వాఁడుగనే నిలిచియున్నాఁడు.

సివిలు మిలిటరీ డిపార్టుమెంటులలోని గౌరవముగల గొప్ప యుద్యోగము లన్నియు దేశమునకుఁ బరిచయము లేని పరదేశస్థులయందె నిలిచియున్నవి. అక్బరు చక్రవర్తి తన రాష్ట్రమునకు లోఁబడిన సమస్త జాతులవారిని తన పరిపాలనమున నుపయోగపఱుచు చుండెను. మన మట్లు చేయుటలేదు. నడిమితరగతి బ్రిటీషు వాని యోర్వలేనితనము, స్కాట్లండు దేశస్థుని యత్యపేక్షయు, తమతమ జీతములనే యపేక్షించుచు ఇండియా దేశస్థుల పెంపొందవలెననెడి కోరికలను మూలకుఁ ద్రోయుచున్నవి. ఈ పద్ధతివలని ఫలములు భీకరములు గాకమానవు.''

హోము గవర్న్మెంటను పేర నింగ్లాండులో నిండియా దేశముయొక్క పరిపాలనము నడుపఁబడుచుండుటచేత నందు నిమిత్తమై యిచ్చటినుండి ధనము పంపఁబడుచున్నది. విక్టోరియా మహారాజ్ఞిగారు సింహాసన మెక్కినప్పుడీ హోము చార్జసుక్రింద నిండియానుండి సుమారు 30,000,000 రూపాయిలు ప్రతివత్సరమును గొనిపోఁబడుచుండెను. ఆమె నిర్యాణముఁ జెందిన సంవత్సరమున నాసొమ్ము 160,000,000 రూపాయిల వఱకును బెరిగినది.

1834 వ సంవత్సరము నుండి 1899 వ సంవత్సరము వఱకును గల కాలములో నివ్విధమున సీమలోని హోము గవర్న్మెంటువారు ఇండియానుండి కొని పోయినట్టియు, ఇండియా సంబధమై యప్పు మొదలగు వానివలన గ్రహించినట్టియు రసీట్లమొత్తము 823,491,393 పౌనులు అనఁగా పౌను పది రూపాయిల చొప్పున సుమారు 823 కోట్ల రూపాయిలయి యున్నది.

ఇంతభాగ్యవంతమైన యిండియాదేశము అప్పులలోఁగూడ మునిఁగి యుండుట కడు శోచనీయము-1898-99 వ సంవత్సము నందీ యప్పు 124,268,605 పౌనులై యుండెనని డిగ్బీకొర గారు తెలియఁబఱుచుచున్నారు.

1792 వ సంవత్సరములో ఇండియా దేశముయొక్క అప్పు సుమారు రూ 70,000,000లు అయి యుండెను. 17.9 వ సంవత్సరమున కది రూ 100,000,000 ల వఱకును బెరిగినది. 19 వ శతాబ్దాదిని లార్డు వెలస్లీ చేసిన యుద్ధముల మూలమున ఆయప్పు 1805 వ యేట రమారమి రూ 2 0,000,000 ల వఱకును వృద్ధిఁజెందెను. 1807 వ యేట నది రూ 270,000,000 లు అయ్యెను! తరువాతఁ గొన్ని సంవత్సరముల వఱకును ఆసంఖ్య యా ప్రాంతములనే నిలిచియుండి 1829 వ సంవత్సరమున రూ 300,000,000 ల వఱకును సాగెను.

తమ దేశముయొక్క యభివృద్ధికిఁ దోడుపడు యుద్ధపు ఖర్చులు బ్రిటీషువారే పెట్టుకొనుటయు, ఇండియా దేశముయొక్క పరిపాలనమునకు మాత్రము సరిపోవు వ్యయము ఇండియనులు భరించుటయు న్యాయ్యముగా నుండునని యీ సందర్భమున రమేశచంద్ర దత్తుగారు వ్రాయుచున్నారు, ఈ పద్ధతి యెంత మాత్రమును లేక బ్రిటీషు వారు మొదటినుండియు మనదేశ ధనమునే వారి లాభమునకై వినియోగపఱచుచుండుటచేత మన దేశధనము ప్రవాహరూపకముగా లెక్కలేక బయటికిఁ బోవుటయు, నందుమూలమున పూర్వము నెమ్మదిగలిగి పాటుపడుచు భాగ్యవంతులై సౌఖ్యమనుభవించుచుండిన మనదేశస్థులు దరిద్రులుగాఁ జేయఁబడిరనియు వ్రాసియుండిరి.





మనదేశముయొక్క వాణిజ్య పద్ధతిఁగూడ దేశమును కృశింపఁ జేయునదిగ నున్నది. విదేశములతో వాణిజ్యము జేయుటవలన దేశము భాగ్యవంతమగునని యెల్లరు నంగీకరింతురు. కాని యిండియా వాణిజ్యపద్ధతి మాత్ర మీ ధర్మమునకు వ్యతిరేకముగ నున్నది. మనము నూఱు రూపాయిల విలువగల వస్తువును విదేశమునకుఁ దీసికొని పోయినప్పుడు, మరల మన దేశమునకు వచ్చునప్పుడు, దానికంటె నెక్కువ ధనమునో లేక అధనము విలువగల పదార్థములనో తీసికొని వచ్చినప్పుడు గదా యీ వాణిజ్యము వలన మనకును మన దేశమునకును లాభము కలుగుట? ఇందుచేతనే వాణిజ్యము వలన వెంపొందెడు దేశము లందెల్ల నెగుమతులవిలువకంటె దిగుమతుల వెల యధికముగా నుండుచుండును. మన దేశములో నట్లు లేదు. దిగుమతులకంటె నెగుమతులే యధికముగా నున్నవి. అందుచేత నేఁటేటను మనధనము రూ 180,000,000 లు ఒక్క పైసయైనను తిరిగి రాక మనదేశమునుండి పోవుచున్నదని దాదాభాయి నవరోజిగారు వ్రాసియున్నారు.

ఈయంశము చక్కగా బోధపడుటకై యొక్క చిన్ని యుదాహరణము చూపెదను. 1735 వ సంవత్సరమున నింగ్లీషు వర్తకులు రూ 150,000,000 ల విలువగల వెండి బంగారులను ఇండియాకుఁ దీసికొనివచ్చి రూ 3,375,000,000 ల విలువగల వస్తువులను ఇండియానుండి తీసికొని పోయిరి. ఈ విధముననే మన దేశవాణిజ్యమున నెగుమతులకంటె దిగుమతులు అధికముగా నున్నవా? లేదు. 19 5-06 సll లో మనదేశపు ఎగుమతులు రూ 1,68,15,[illegible]8,498 లును దిగుమతులు రూ 1,23,98,71,716 లును అయి యున్నవి మనవిదేశ వాణిజ్యము వలన మనకు లాభము లేకపోవుట యటుండఁగా నీపై సంఖ్యలనుబట్టి యెంత నష్టము కలుగుచున్నదో స్పష్టపడుచున్నది కదా. ఇంగ్లీషు వారు వర్తకము వలననే జీవింపవలసిన వారు గనుక తమ దేశమునకు నష్టము కలుగుట యొప్పుకొనరు. మన లాభము వారికి నష్టము, వారి నష్టము మనకు లాభము. అందుచేత మనదేశ వస్తువ్యాపారము-రక్షింపఁబడకున్నవి. అన్యదేశములయందు తమదేశ వాణిజ్యమే వృద్ధియై తమ దేశస్థులే బాగుపడుటకై, అన్య దేశములనుండి తమ దేశములలోనికి వచ్చెడి సరకులమీఁద పెద్దసుంకములు వేసి, తమ దేశవస్తువుల బజారు ధరలకంటె ఇతర దేశవస్తువుల ధర లెక్కువ యగునట్లు చూచుచుందురు. దీనికే రక్షణమని పేరు. ఇది బోధపడుటకై యొక్క యంశమును జూపెదను. మనదేశము యొక్క నూలు వస్త్రములయు, పట్టు వస్త్రములయు వ్యాపారమే పూర్వము విశేషోన్నతిఁ జెంది యుండెడిది.

ఇంగ్లీషువారు తమ స్వలాభము కొఱకు ఇండియాలో తమ దేశపు నూలు వస్త్రములు దిగుమతి యగునప్పుడు నూటికి 3½ చొప్పునను, ఇండియాలో చేసిన నూలు వస్త్రములే యింగ్లాండులో దిగుమతి యగునప్పుడు నూటికి 10 చొప్పునను, దిగుమతి పన్నును విధించిరి. ఇండియా పట్టు వస్త్రములు సీమలో దిగుమతి యైనచో నూటికి 20 చొ॥ పన్ను విధించిరి. ఇదియే రక్షణ పద్ధతి. ఇంగ్లీషువారు ఈ విధమునఁ దమ దేశ వ్యాపారమును రక్షించుకొనుటచేత, మన యెగుమతులు క్రమముగా క్షీణించిపోయి తుదకు రూపుమాపఁబడెను. అందుచేత విదేశవస్తువులు నానాఁట మనదేశమునకు దిగుమతి యగుచుండి స్వదేశవస్తు సంరక్షణము లేకుండుటచే దేశము క్రమముగా నిర్భాగ్యము కాఁజొచ్చినది. ఇంగ్లాండునుండి మన దేశమునకుఁ క్రమముగా వస్త్రముల దిగుమతి యెట్లు వృద్ధియయ్యెనో యీ క్రింది సంఖ్యలను జూచి చక్కఁగా గ్రహింపవచ్చును.

1794 వ సం॥ లో ఇంగ్లాండు నుండి యిండియాకు దిగుమతియైన నూలు వస్తువుల విలువ రూ 1,530

| | | |
|---|---|---|
| 1800 | ,, | 190,000 |
| 1806 | ,, | 480,000 |
| 1812 | ,, | 1,000,000 |
| 1904 | ,, | 830,000,000 |

దేశమునకుఁ గలుగుచున్న యింతటి నష్టమును జూచియే ప్రస్తుతము మనదేశమునందెల్ల ప్రముఖులైన వారందఱును విదేశ వస్త్రములు మొదలగు వానిని బహిష్కరించిననే గాని మనము బాగుపడ నేరమని నమ్మి యీ బహిష్కారపద్ధతి నవలంబించుచున్నారు.

మొత్తము వాణిజ్యమును బరీక్షించినచో నింతకంటె విచారకరములైన యంశములు బయలు దేఱును. 1834 వ సం॥ మొదలుకొని 1899 వ సంవత్సరము వఱకును గల కాలములో ఇండియా దేశము 1,889,295,840 పౌనుల విలువగల వస్తువుల దిగుమతి చేసి నట్టును, 2,334,147,730 పౌనుల విలువ గల వస్తువుల నెగుమతి చేసి నట్టును దెలియుచున్నది. ఈసంఖ్యల నన్నిటినిబట్టి గత శతాబ్దములో వాణిజ్యము వలన నిండియా దేశమునకు సుమారు (పౌను పది రూపాయిల చొ॥) రూ 50,000,000,000 లు నష్టము వచ్చినదని డిగ్బీ దొర గారు గణించి యున్నారు.





వాణిజ్యము వలన హిందూ దేశమున కింతటి నష్టము కలుగుచుండుటచే రక్షణయే కర్తవ్యమని పలువురు ప్రసిద్ధ పురుషు లభిప్రాయపడిరి. ఈ యంశమును గూర్చి "ఇతర విదేశీయుల నుండియే కాక మన దేశస్థుల నుండి కూడ రక్షింపఁబడకున్నచో ఇండియా దేశమున కృషికర్త లెన్నఁటికిని స్థాపింపఁబడ నేరరు" అని సర్ గిఫ్ఫర్డు మాలెస్వర్తు కే. సి. ఐ. ఇ. గారు చెప్పిరి.

స్వదేశవస్తు సంరక్షణము మనకు లేకుండుటయు, సర్వకాలమున మన దేశధనము ప్రవాహమువలె బయటికిఁ బోవుచుండుటయు, నెల్లరు నెఱుంగుదురు. గత శతాబ్దాదిని మన దేశమునుండి బయటికిఁబోవు ధనము సుమారు రూ 30,000,000 లు అని యింతకు మున్ను గణించి యుండిరి. ఈ దేశమునందున్న బ్రిటీషువారు తమ దేశమునకు ప్రైవేటు రెమిటన్సు లను పేరఁ బంపిన సొమ్ముతోఁగూడ గలుపుకొని యది రూ 50,000,000, లు అని యప్పు డూహింపఁబడెను. ఇప్పుడున్నచో సుమారు (పౌను పదునైదు రూపాయిల చొప్పున) పౌ 30,000,000 లు బయటికి ఏటేట బోవుచున్నవి. కాఁబట్టి యొక్క నూరేండ్ల కాలములో బయటికిఁబోయెడి యీ ధనప్రవాహము ఆఱురెట్లు వృద్ధిఁ జెందినదని దాదాభాయి నౌరోజీ గారు చెప్పుచున్నారు.

ఇంతధనము పోవుచుండఁగా హిందూదేశమిట్టి హీన దశకు వచ్చుటలో నేమి యాశ్చర్య మున్నది?

ఒక దేశములో గ్రహింపఁబడిన పన్నులు వేఱొక్క దేశములో వ్యయపఱుపఁబడుచున్నప్పుడా దేశము అధోగతిఁ జెందకుండఁగలదు? అట్టి స్థితిలో నే దేశము క్షామముల చేతను, అపూర్వవ్యాధుల చేతను పీడింపఁబడకుండఁగలదు?

మన దేశమునందు వచ్చు క్షామముల వలన జనులు నశించుటకు హేతువు తగిన పంటధాన్యములు దేశములో లేక కాదు. ఆ పండిన పంటను కొని తినుటకుఁ దగు ధనము ప్రజల యధీనమున లేకుండుటయే. మన దేశమునందు పైఁజెప్పిన కారణముల వలనఁ గలిగినది ధన దారిద్ర్యమే గాని పంట దారిద్ర్య మెన్నటికిని గాదు. పుండుమీఁద నేలు కుట్టినట్లు ఈ నిర్భాగ్యమునకుఁ దోడు వస్తువులధరలు నానాఁటికి వృద్ధిఁ జెందుచున్నవి. పన్నులకై గ్రహింపఁబడిన ధనమును వ్యయము చేయుటలో మనకు రవ్వంతయేని యధికారము లేకున్నది.

1853 వ సంవత్సరమున సర్ జార్జి వింగేటు గారు వచించిన యీ క్రింది వాక్యముల నరయఁదగును :—

''ఏదేశమునందు పన్నులవలన గైకొనఁబడినధనము ఆ దేశమునందే వ్యయపఱుపఁబడుటవలని ఫలములును, ఒక దేశమునందలి పన్నుల వేఱొక దేశమునందు వ్యయపఱచుట వలని ఫలములును వేఱువేఱు. మొదటి పద్ధతివలన ఆపన్నులు మరల ఆదేశమునందు కృషి చేసికొనువారికే వచ్చుచున్నవి. ఒక దేశములోని పన్నులను విదేశమునందు వ్యయము చేసినను, ఆధనమును సముద్రములో పాఱఁబోసినను రెండును ఒక్కటే. ఇండియానుండి యిన్గ్లండునండియు మనము గ్రహించిన కప్పము ఈవిధముగా నున్నది. ఈకప్పమువలని ఫలమెంత క్రూరమైనది గాను, ఇండియాను అధోగతి పాలు చేయునది గాను ఉన్నదో కొంత గ్రహింప వచ్చును. ఇండియాదేశపు కప్పమును న్యాయమనెడి త్రాసులోఁ జూచినను, లేక మనస్వలాభము విషయమును యోచించినను, భూతదయకును, సాధారణ జ్ఞానమునకు, రాజ్యతంత్ర శాస్త్రముయొక్క సాధారణ పద్ధతులకును గూడ విరుద్ధముగా నున్నట్లు స్పష్టపడక మానదు.''

ఈరీతి పరిపాలనము నందు వినాశకరమైన లోప మున్నదనియు, అందుమూలమున నీ గవర్నమెంటునకును, ఎవరిపక్షమున నీ గవర్నమెంటు నడుచుచున్నదో అట్టి బ్రిటీషు వారికిని, కొద్ది కాలములోనే ఆపత్తును, తలవంపులును రాకమానవు, అని ప్రసిద్ధి వహించిన జాన్ బ్రైటు దొరగారు 1877 వ సంవత్సరమున వక్కాణించి యుండిరి. ఆయనయే వేఱొకచోట నిట్లు చెప్పచున్నారు:—

''ఇంగ్లాండు దేశలాభము ఇండియా దేశలాభము నుండియే కలుగవలయును. ఇండియాతో మనకుఁగల సంబంధము వలన మనకేమైనను లాభము కలుగవలెనన్నచో రెండు మార్గములు మాత్రమే యున్నవి. ఒకటి వారిని దోచుకొనుట వలనను, వేఱొకటి వారితో వాణిజ్యము చేయుట వలనను. ఇందు మొదటి దానికంటె రెండవ దాని వలననే మనము లాభముఁ బడయ మంచిదని నాయభిమతము. కాని, ఇండియా దేశముతో వ్యాపారముచేసి యిఙ్గ్లాండు భాగ్యవంతము కావలెనన్నచో ముందు ఇండియా భాగ్యవంతము కాక తప్పదు.'' బ్రిటీషు అధికారులు ఇట్టి స్వార్థము నాలోచించియైనను పూర్వపద్ధతిని మాని క్రమముగా రెండు దేశములకును మేలు కలుగునట్లు పరిపాలింపఁజాలరాయని దాదాభాయి నౌరోజీ గారు ఈసందర్భమునఁ బలుకుచున్నారు.

1833 వ సంవత్సరమున పార్లమెంటులోని ఆక్టుప్రకారము బ్రిటీషువారు ఇండియాలో వారి యధీనములో నున్న నేటివులును, బ్రిటీషు దేశము నుండియే వచ్చి యిండియాలో నున్న ప్రజలును, ఎట్టి మత మవలంబించిన వారైనను, ఎచ్చోట జనించిన వారైనను, కంపెనీవారి దొరతనములో నెట్టి యుద్యోగము గాని గౌరవపదవి గాని





పొందుట కాటంకము లేదని ప్రతిజ్ఞ సలిపి యుండిరి. తరువాత 1858 వ సంవత్సరములో ఇండియా పరిపాలనము కంపినీవారి చేతిలో నుండి రాణిగారి యధీనమునకుఁ బోయినప్పు డామె యీవిధముగానే ప్రతిజ్ఞఁ జేసి ఇతర దేశములలో బ్రిటీషు ప్రజలను మనలను ఒక్క తీరుగానే జూతు మనియుఁ బ్రతిజ్ఞ జేసి యుండిరి. 1877 వ సంవత్సరమున రాణి గారు 'ఎంప్రెసు' అను బిరుదువహించు కాలమున ఢిల్లీ నగరమున జరిగిన సభలో వైసు రాయియైన లార్డు లిట్టను గారును ఇట్టి ప్రతిజ్ఞనే తెలిపి యుండిరి. కాని యీ ప్రతిజ్ఞల నెంతవఱకు బ్రిటీషువారు నిలుపుకోఁ గలిగిరి? మనము బాగుండుటయే వారు బాగుండుటయని వారు చెప్పిరే, మనమిట్లు నిఱుపేదలమై నానాఁటికి క్షీణించుచున్నట్లు వారి లెక్కల వలననే గనుపట్టుచుండఁగా, వారిలోనే దయార్ద్ర హృదయులగు దొరలు పలువురు మొఱ్ఱ లెత్తుచుండఁగా, వారు మన నిర్భాగ్య దశను వొలంచుటకై యేమిచేయుచున్నారు? ఈ మధ్యనేకదా ఇండియాదేశపు కార్యదర్శియగు జాన్ మోర్లే దొరగారు తమ బుద్ధిపోవునంతవఱకు చూడఁగా ఇండియాదేశ పరిపాలనము ఇఁకముందును నిరంకుశాధికారముగానే యుండవలెనని వక్కాణించిరి? కాఁబట్టి యన్యులవలన నేమో లాభములు కలుగఁగలవని నమ్మియుండక దేవుని మొగము చూచి న్యాయవర్తనులమై, దేశభక్తులమై, స్వయంసహాయము నను, స్వశక్తి విశ్వాసము నను, మనదేశ దారిద్ర్యమును వొలఁగించుటకు మనమే ఘనప్రయత్నములు సలుపుటయే కర్తవ్యమయి యున్నది.

---

సమాప్తము.

